LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 46 | 17.11.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రధాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# రైతన్నల ఆక్రందనల్లో బాబుగారి స్వర్ణాంధ్ర!

రాష్ట్రంలో వ్యవసాయ రంగం పరిస్థితి అంతా గందరగోళంగా తయారౌ తున్నది ఇటు రైతులు, అటు ప్రభుత్వం కూడా దిక్కుతోచని స్థితిలో పడిపోయి వున్నారు. రెండేళ్ల నుంచి సక్రమంగా వర్షాలు కురవక పోవడం వంటి ప్రకృతి సంబంధిత కారణాలు; చాలినంత విద్యుత్ సరఫరా చేయలేని ప్రభుత్వ అసమర్థత; విచక్షణారహితంగా దిగుమతులను ప్రోత్సహిస్తున్న కేంద్ర ప్రభుత్వ అస్తవ్యస్త విధానాలుకలగలిసి వ్యవసాయ రంగాన్ని సంక్షోభంలోకి నెట్టి వేస్తున్నాయి.

నీళ్లు లేవు. కరెంట్ లేదు. గిట్టుబాటు ధరలు లేవు. స్థూలంగా రైతు భవిష్యత్తును, బ్రతుకును చిందరవందర

## గిట్టుబాటు ధరల్లేక రైతాంగం విల, విల

చేస్తున్న అంశాలివి. జూన్, సెప్టెంబరు నెలల మధ్య కృష్ణానదిపై వున్న రిజర్వాయర్లన్నీ నిండిపోవడం మామూలు. చాలా సంవత్సరాలు ఈ రిజర్వాయర్‌ల నుంచి రైతులకు నీరు విడుదల చేస్తూ వుంటే, మళ్లీ నిండడం జరుగుతుంటుంది. కాని ఈ యేడాది ఒక్క శ్రీశైలం, కొద్దిగా జూరాల రిజర్వాయర్లకు మాత్రమే నీరు అందింది. దిగువన వున్న నాగార్జున సాగర్ సగం కూడా నిండలేదు. కృష్ణానది నీళ్లతో ప్రత్యక్షంగా కాని, పరోక్షంగాని లక్షలాది ఎకరాల భూమి సాగయ్యే గుంటూరు, కృష్ణ, ప్రకాశం, నల్గొండ, ఖమ్మం జిల్లాలు; తుంగభద్రపై ఆధారపడే కర్నూలు, కడప జిల్లాలు ఎక్కువగా నష్టపోబోతున్నాయి. గోదావరి డెల్టాకు మాత్రం చెప్పుకోదగ్గ సమస్యలు లేవు. నెల్లూరు జిల్లాను సోమశిల ప్రాజెక్టు కొంతలో కొంత కాపాడుతున్నది. తెలంగాణా జిల్లాలలో పరిస్థితి హృదయ విదారకం. వీరు అధికభాగం బావులు, ఫిల్టర్ పాయింట్లపై ఆధారపడతారు. వర్షాలు సక్రమంగా లేనందువల్ల భూగర్భజలం పాతాళానికి చేరిపోయింది. బావులు లోతు చేసుకోవడానికి, ఫిల్టర్ పాయింట్లు మరింత దిగువగా దింగించడానికి రైతుల దగ్గర ఆర్థిక సోమత లేదు. ఒకవేళ అప్పుచేసి ఆ ఏర్పాట్లు చేసుకున్నా వారికి కరెంట్ సరఫరా చేసే స్థితిలో రాష్ట్ర ప్రభుత్వం లేదు. ఎన్‌టిపిసి వంటి సంస్థలకు ప్రైవేటు విద్యుత్ సరఫరాదారులకు కొన్ని కోట్ల రూపాయలు అప్పు పడి వున్నది. కరెంటు ఛార్జీలు అపరిమితంగా పెంచినా విద్యుత్ బోర్డు మాత్రం దివాలా స్థితి నుంచి బయటపడలేదు. సాధారణంగా మార్చి, ఏప్రిల్, మే నెలలో విద్యుత్ కొరత ఏర్పడుతుంటుంది. అప్పుడు ఇతర రాష్ట్రాల నుంచి విద్యుత్ కొనుగోలు చేస్తుంటారు. కాని ఈసారి నవంబరు నెలలోనే పరిస్థితి చేయిదాటి పోయింది. గత ఆరేడేళ్ల కాలంలో ఒక్కటంటే ఒక్క కొత్త విద్యుత్ కర్మాగారం నిర్మించ లేకపోయింది రాష్ట్ర ప్రభుత్వం. సంవత్సరం, సంవత్సరానికి పెరిగిపోతున్న విద్యుత్ అవసరాలు - ఉత్పత్తి పెంచకుండా ఎట్లా సర్దుబాటు చేస్తారు? ఫలితం - నవంబరు నెలలోనే రోజుకు నాలుగు గంటల విద్యుత్ కోత. పల్లెల్లో దీపం వెలగడం అపురూపమై పోయింది. కేవలం ఆరు గంటలు మాత్రమే మోటార్లకు కరెంట్ వదలుతున్నారు. దాన్ని నమ్ముకొని పైర్లు సాగుచేయడం కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదడం వలె వుండబోతుంది.

వీటన్నిటినీ మించినది ధరల

## కరెంట్ కోతతో వాతలు సి.ఎం. హైటెక్ కోతలు!

సమస్య. వడ్ల ధర దినదినానికి పడిపోతున్నది. తగ్గిన ధరలలో సైతం కొనే దిక్కు లేదు. రైస్ మిల్లులు కొన్ని వందల సంఖ్యలో మూతపడి పోయి వున్నాయి. ధాన్యం నిల్వ చేసిన రైతులు దివాలా తీసేటట్లున్నారు. జనవరి నెలకు ఇప్పటికి పుట్టికి దాదాపు 500 రూపాయల ధర తగ్గడమే కాదు - తేమ ఎండిపోవడం వల్ల వచ్చే నష్టం కలుపుకొంటే రైతుకు కోలుకోలేని దెబ్బ. ఖర్చులు సైతం గిట్టుబాటయ్యే పరిస్థితి లేదు. ఇప్పుడు రబీ సీజన్‌లో పండబోయే వడ్లు కొనేవారు

తరువ 7వ పేజీలో

# కరణం కారు కేసు నీరుగార్చేయత్నం

ఒంగోలు ఎమ్పీ కరణం బలరాం కారు ప్రమాదం కేసు ఢిల్లీ పోలీసులకు పెద్ద సంకటంగా తయారైంది. ఇది సాధారణ కారు ప్రమాదమైతే వారు అంత సీరియస్‌గా పట్టించుకునే వారే కాదు. సింపుల్‌గా పరిష్కారమై పోవలసిన విషయం. బలరాం వైఖరి వల్ల సంక్లిష్టంగా మారడంతో ఢిల్లీ పోలీసులు తలలు పట్టుకొంటున్నారు. ప్రమాదం జరిగిన సమయంలో దాన్ని ప్రత్యక్షంగా చూడడంతోపాటు, ఆ స్థలం నుంచి బలరాం కారు అద్దం నుంచి క్రిందకు పడిన పార్లమెంట్ స్టిక్కర్‌ను సైతం సేకరించిన స్వాభిమాన్ సంస్థ అధ్యక్షురాలు మంజు సచ్‌దేవ పోలీసులపై విపరీతమైన వత్తిడి తెస్తున్నది. కేసును మాఫీ చేయడానికి ప్రయత్నిస్తే హైకోర్టులో ప్రజాప్రయోజన వ్యాజ్యం దాఖలు చేసే ప్రమాదం కన్పించడంతో ఉన్నతాధికారులందరూ దీనిపై శ్రద్ధ చూపిస్తున్నారు.

ప్రమాదం జరిగిన సమయంలో కారులో బలరాం వున్నాడా లేడా అన్నది మొదట తేలవలసిన ప్రశ్న; అయితే దీనికి

## న్యాయం కోసం పోరుకు - స్వాభిమాన్ సంస్థ యత్నం!

సమాధానం చెప్పడానికి బలరాం ఆసక్తి చూపడం లేదు. ఆయనను కలిసి మాట్లాడడానికి ఢిల్లీ పోలీసు బృందం హైదరాబాదుకు, ఒంగోలుకు వచ్చింది కాని బలరాం వారికి ఇంటర్వ్యూ ఇవ్వలేదు. ఆయన బెంగుళూరులో వున్నారని ఇంట్లోవారు సమాధానం చెప్పారు. అయితే సోమనాథ్ చటర్జీ నేతృత్వంలోని పార్లమెంటరీ సంఘంతో కలిసి ఆయన హైదరాబాదులో వున్నట్లు, హైటెక్ సిటీలో ఒక కార్యక్రమంలో పాల్గొన్నట్లు ఢిల్లీ పోలీసు బృందం సమాచారం సేకరించింది. ముఖ్యమంత్రి చంద్రబాబును సైతం బలరాం కలిసినట్లు పత్రికలలో వార్తలు వచ్చాయి. పార్లమెంటు సభ్యుడిగా బాధ్యతాయుతమైన పదవిలో వుండి ఆయన ఇట్లా తప్పించుకొని తిరగడం; ముఖ్యమంత్రి చంద్రబాబు సైతం తమతో సహకరించకుండా ఆయన్ను రక్షించచూడడం ఢిల్లీ పోలీసులకు తికమక కల్గించింది. ఇక ఏ దారీ కన్పించక, జాయింట్ కమీషనర్ ఆఫ్ పోలీసు సురేష్ రాయ్, బలరాంను తమతో సహకరించేందుకు

తరువ 12వ పేజీలో

# నెల్లూరు దేశంలో ఇన్‌ఛార్జి కోసం కీచులాట

నెల్లూరు నియోజకవర్గం తెలుగు దేశం పార్టీ ఇన్‌ఛార్జి వ్యవహారంలో పార్టీలోని రెండు వర్గాల మధ్య జుట్లు పట్టుకొని కొట్టుకొనే సంస్కృతి గత పదిరోజుల్లో బాగా ముదిరి పాకాన పడింది. నెల్లూరులో సభ్యత్వాల సేకరణకు ఆ పార్టీ అధిష్టాన వర్గం 17 మందితో ఒక ఎయిర్ బస్ కమిటీని ఏర్పాటు చేసింది. ఇందులో 13 మంది మంత్రి ఆదాల చెప్పిన పేర్లే ఉన్నాయి. మిగిలిన నలుగురిలో, రమేష్‌రెడ్డి, ఆయన భార్య అనూరాధ, మరో ఇద్దరు వాళ్లకు అనుకూలురైన కౌన్సిలర్లు ఉన్నారు. సభ్యత్వాల కమిటీలో, తన ప్రత్యర్థులకే పెద్ద పీట వేయడంతో రమేష్‌రెడ్డి అగ్గిమీద గుగ్గిలమై పోయారు. ఇతర పార్టీల్లో నుంచి, ఇటీవల కాలంలో తెలుగుదేశం పార్టీలోకి చేరిన వారికి, దొంగతనంగా కరెంట్ వాడే కేసుల్లో

## సభ్యత్వాల కార్యక్రమంలో మంత్రి ఆదాల జోరు - తాళ్లపాక గైర్హాజరు

ఇరుక్కున్న ఏ.టి.రంగరాజన్ లాంటి నిందితులకు కమిటీలో స్థానం కల్పించారని పార్టీ నాయకత్వానికి ఫిర్యాదు చేశారు. దీన్ని ఎవరూ పట్టించు కోక పోవడంతో, సభ్యత్వ కమిటీ విస్తృత సమావేశంలో, ఒకరినొకరు బండ బూతు లు తిట్టుకొని, చొక్కాలు పట్టుకొనే పరి స్థితి తలెత్తింది. దీంతో సభ్యత్వ పుస్తకాల పంపిణీ వ్యవహారం కూడా వీధిన పడింది. హైద్రాబాద్ నుంచి వచ్చిన పార్టీ సభ్యత్వ పుస్తకాలను తనకు ఇవ్వలేదని రమేష్‌రెడ్డి అధిష్టాన వర్గానికి ఫిర్యాదు చేశారు. సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి ద్వారా తన వాదనను వినిపింపజేశారు. సభ్యత్వ పుస్తకాల తగాదా ఏదో నెల్లూరులోనే పరిష్కరించు కొండని వాళ్లు సలహా చెప్పి చేతులు దులిపేసుకున్నారు. రమేష్‌రెడ్డి తమను సభ్యత్వ పుస్తకాలు అడగలేదని, జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడు ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి చెప్పాడట. చివరకు, సోమిరెడ్డి మధ్యవర్తిత్వంతో, రమేష్‌రెడ్డి గ్రూపుకు 400 సభ్యత్వ పుస్తకాలను అప్పగించడం జరిగింది. ఆ తర్వాత సభ్యత్వాల నమోదులో తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో మరో వివాదం తలె త్తింది. పట్టణంలోని 44 వార్డులకు పోయి సభ్యత్వాలను చేర్పించాల్సి ఉండగా, తాను జిల్లా తెలుగుదేశం కార్యాలయంలోనే ఉండి సభ్యులను చేర్పిస్తానని, అందరినీ కార్యాలయానికే పిలిపిస్తానని రమేష్‌రెడ్డి చెప్పడంతో, ప్రత్యర్థి వర్గం అడ్డుకొంది. దీంతో మళ్లీ ఇరు వర్గాల మధ్య బూతు పురాణం, ఆరోపణల పర్వం చోటు చేసుకొని, వ్యవహారం కంపు, కంపుగా తయారైంది. రమేష్‌రెడ్డి ప్రతి చిన్న విషయానికి తగాదా పెట్టుకుంటున్నాడని ప్రత్యర్థి వర్గం అధిష్టాన వర్గానికి ఫిర్యాదు పంపింది.

ఈ నేపథ్యంలో మంత్రి ఆదాల వర్గీయుల ఆధ్వర్యంలోనే, నెల్లూరులో సభ్యత్వ కార్యక్రమాల చేర్పిడి కార్యక్రమం ముమ్మరంగా సాగుతోంది. రెండు మూడు వార్డులు కలిపి, ఒక సభ ఏర్పాటు చేసి, జనాన్ని సమీకరించి, స్వచ్ఛందంగానో, బలవంతంగానో పార్టీ సభ్యత్వాలను చేర్పిస్తున్నారు. ఒకప్పటి తన మాజీ జాగీరు అయిన నెల్లూరులో, మంత్రి ఆదాల మూడు రోజుల పాటు విస్తృతంగా సభలు నిర్వహించి సభ్యత్వాల కార్యక్రమాన్ని ప్రారంభింపచేయడం రమేష్‌కు పుండు మీద కారం చల్లినట్టయ్యింది. మూడు రోజుల పాటు, నెల్లూరులో మంత్రి ఆదాల ప్రభాకర్‌రెడ్డి పాల్గొన్న ఏ సభలోనూ రమేష్‌రెడ్డిగానీ, ఆయన భార్య మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధ గానీ పాల్గొనక పోవడం విశేషం. తన భార్యకు ఛైర్‌పర్సన్ పదవి పోయినా తాను లెక్క చేయనని, ఆదాలతో కలిసే ప్రశ్నే లేదని రమేష్‌రెడ్డి చెబుతున్నాడు. పాపం! గతంలో ఆదాల ప్రసన్నత కోసం ఆయన వాకిట పడి గాపులు కాసిన విషయం మర్చి పోయి నట్టున్నారు. లొంగుబాటుకు సిద్ధమైన రమేష్‌రెడ్డిని, మంత్రి ఆదాలే తిరస్కరించిన విషయం తెలిసిందే. ఇదిలా ఉండగా నెల్లూరులో సభ్యత్వ కార్యక్రమాల చేర్పిడి వ్యవహారం ఇంత సందడిగా జరగడానికి, పార్టీ నియోజ కవర్గ ఇన్‌ఛార్జి పదవి కోసం పేదే ఆరాటమే తప్ప మరొకటి కాదు. ప్రస్తుతం రేసులో, తెలుగు యువత మాజీ అధ్యక్షుడు వై.వి.రామిరెడ్డి, రమేష్‌రెడ్డి ఉన్నారు. మంత్రి ఆదాల వై.వి. రామిరెడ్డి పేరునే సిఫార్సు చేస్తున్నారు. రమేష్‌రెడ్డి మాత్రం నెల్లూరులో తానొక్కడినే నిజ మైన, నిఖార్సయిన తెలుగుదేశం వాడి నని, ప్రజల్లో తనకే మద్దతు ఉందని, అందువల్ల ఇన్‌ఛార్జి పదవి తనకే ఇవ్వా లని గట్టిగా పట్టుపడుతున్నారు. ప్రస్తు తం, ఆయన బలమంతా సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డే. అయితే, ముఖ్య మంత్రికి, రమేష్‌రెడ్డి అంటే పడదని సోమిరెడ్డికి బాగా తెలుసు. అందువల్ల చంద్రమోహన్‌రెడ్డి రమేష్‌రెడ్డి వాదనను, హైద్రాబాద్‌లో పార్టీ నాయకులు, పరిశీలకుల వద్దనే గట్టిగా వినిపిస్తు న్నారు.

రమేష్‌రెడ్డిని నెత్తిన వేసుకొంటే ముఖ్యమంత్రి దగ్గర తనకు మైనస్ మార్కులు పడతాయని తెలిసే, జాగ్రత్తగా నాటకం ఆడుతున్నాడు. ఆదాలకు వ్యతిరేకంగా జిల్లాలో తన చేతిలో ఉన్న ఒకే ఒక్క పావు రమేష్‌రెడ్డి. దాన్ని కూడా చేజార్చుకుంటే బాగుం డదన్న ఉద్దేశ్యంతో, రమేష్‌రెడ్డి విషయం లో పైపూత రాజకీయాలు చేస్తున్నాడు.

పనికి మాలిన ఇన్‌ఛార్జి పదవి కోసం రమేష్‌పడుతున్న ఆరాటం చూస్తుంటే జాలివేస్తోంది. మున్సిపల్ ఛైర్మన్‌గా, ఎమ్మెల్యేగా, మంత్రిగా పనిచేసిన వాడు ఇప్పుడు, తన భార్య అనూరాధను మున్సిపల్ ఛైర్మన్‌ను చేసి తానే కర్రపెత్తనం చేస్తున్నవాడు హుందాగా రాజకీయాలు చేయాల్సింది పోయి, ఇన్‌ఛార్జి కోసం వీధినపడి పోయాడు. ఒకప్పుడు తన వెంట బాడీగార్డుల్లా తిరిగిన వాళ్లతో పోటీపడి, తన స్థాయిని తానే దిగజార్చు కుంటున్నాడు.

నెల్లూరులో పార్టీ పెత్తనం తన

తొరవ 12వ పేజీలో




కొత్తగా పెట్టి మదీనా వాచ్ హౌసును చూసుకొంటూ ముసిముసి నవ్వులు రువ్వుతున్న షేక్ ఇస్మాయిల్.

# ఏఐసిసి ఎన్నిక సుఖాంతం- పిసిసిలోనే ఇక పంతం!

ఏఐసిసి అధ్యక్షురాలిగా సోనియా గాంధీని ఎంపిక చేయడానికి రాష్ట్ర పిసిసి సభ్యులందరూ ఏకత్రాటి మీద నడిచారు. జితేంద్ర ప్రసాదకు ఏజంటు సైతం దొరక నివ్వలేదు రాష్ట్ర నాయకులు. సీనియర్ నేతలందరూ సాధారణ సభ్యుల కంటే ముందు గాంధీ భవన్‌కు వచ్చి ఓట్లు వేయడం విశేషం. ఓటు తప్పినా, వేళకు రాకున్నా సోనియాగాంధీకి వార్తలు వెళ్లి పోతాయని భయపడి పోయారు అందరూ. ఏఐసిసి సభ్యత్వాలు, సిడబ్ల్యుసి ఎన్నికలు వంటివన్నీ ఢిల్లీ నిర్ణయంతోనే జరుగు తాయని తెలడంతో రాజభక్తి ప్రదర్శనకు అన్ని మార్గాలూ అనుసరించారు.

ఇప్పుడు అందరి దృష్టి పిసిసి అధ్యక్షుడిపై పడింది. సత్యనారాయణ రావును ఎట్లయినా మార్చాలనే పట్టుద లతో వ్యవహరిస్తున్నాడు కోట్ల విజయ భాస్కరరెడ్డి. సత్యనారాయణరావును ఆ పదవిలో నియమింపజేసింది తానేనని; కాని ఆయన పదవిలోకి రాగానే తనను నిర్లక్ష్యం చేసి డాక్టర్ రాజశేఖరరెడ్డి పక్షం చేరారని విజయభాస్కరరెడ్డి భావన. పిసిసి సభ్యుల ఎన్నికల ప్రక్రియలో సైతం సత్యనారాయణరావు ప్రవర్తన తన ప్రయోజనాలకు భిన్నంగా వుందని కోట్లవారి కోపం. దానితో ఇక ఎంత మాత్రం సత్యనారాయణరావును కొనసాగనివ్వకూడదన్నది ఆయన పంతం. శివశంకర్, వి.హనుమంతరావు వంటి వారు ఆయనకు వంతపాడు తున్నారు. అందరి మకాం ఢిల్లీలోనే.

అయితే ఇదే పట్టుదలతో సత్యనా రాయణరావును నిలబెట్టడానికి రాజశేఖర రెడ్డి వర్గం సోనియాపై తమ పలుకుబడిని ప్రయోగిస్తున్నది. ఏడాది కాకమునుపే

## సత్యనారాయణ రావును వద్దంటున్న కోట్ల!

పిసిసి అధ్యక్షుడ్ని మారిస్తే ప్రజలలో చులకన అభిప్రాయం ఏర్పడుతుందన్నది వీరి వాదన. పైపెచ్చు సిఎల్‌పి, పిసిసిల మధ్య ఇప్పుడు సామరస్య సంబంధాలు న్నాయని; చంద్రబాబు వంటి సమర్థుడు, రాజకీయ చతురుడితో రాజకీయ సమరం సల్పడానికి ఈ రెండు విభాగాల మధ్య అవగాహన, సమన్వయం తప్పనిసరి అని వీరు గట్టిగా వాదిస్తున్నారు.

ఢిల్లీ పరిస్థితులు గమనిస్తే మాత్రం వీరిద్దరి తాపత్రయం వ్యర్థం అన్పిస్తున్నది. దేశమంతటి నుంచి కాంగ్రెస్‌వాదులు తనను ఏకాభిప్రాయంతో అధ్యక్షురాలిగా

తొరవ 12వ పేజీలో

# ఆదర్శప్రాయుడు జ్యోతిబసు

పశ్చిమ బెంగాల్ ముఖ్య మంత్రి జ్యోతిబసు పదవి పరిత్యాగం చేశారు. 24 సంవత్సరాల సుదీర్ఘ కాలం ఒకే రాష్ట్ర ముఖ్యమంత్రిగా కొనసాగడమే చరిత్రలో పేర్కొనదగిన గొప్ప విశేషం అయితే - తనంతటతాను పదవి విడిచిపెట్టి, వానప్రస్థాశ్రమం స్వీకరించడం మరీ అద్భుత పరిణామం. ఒక్క భారత దేశంలోనె కాదు - యావత్ ప్రపంచంలోనే ఒక నేత వరుసగా ఐదు పర్యాయాలు ప్రజల విశ్వాసం పొంది, ఎన్నికలలో గెలుపొందిన ఘనత చరిత్రలో లేదు. నియంతలు, రాజులు మాత్రమే దశాబ్దాల తరబడి పాలకులుగా వుండగలరు తప్ప, ప్రజాస్వామ్యంలో అది అసాధ్యం. అందులోను జ్యోతిబసు నడిపింది సంకీర్ణ ప్రభుత్వం. మొరార్జీ, చరణ్‌సింగ్, విపి.సింగ్, చంద్రశేఖర్, దేవగౌడ, గుజ్రాల్, వాజ్‌పాయి వంటి వారు పట్టుమని పదినెలల పాటు సంకీర్ణ ప్రభుత్వాలు నడపలేక ఎన్ని అగచాట్లు పడింది, వారి ప్రభుత్వాలు పేక మేడల కంటే హీనంగా పడిపోయింది మనకు తెలిసిన అనుభవాలే. ఆ కోణం నుంచి చూసినప్పుడు జ్యోతిబసు సమర్థత, రాజనీతిజ్ఞత ఎంత గొప్పవో చెప్పకనే అర్థమైపోతుంది. ఇంకొక విశేషం - ఈ పాతికేళ్లపాటు కేంద్రంలోని ప్రభుత్వాలతో జ్యోతిబసుకు సత్సంబంధాలు లేవు. ఆయన కాంగ్రెస్, బిజెపి పార్టీలు రెండింటికీ బద్ధ వ్యతిరేకి. కేంద్రంలోని ప్రతి ప్రభుత్వం బెంగాల్‌లో వామపక్షాలను బలహీనపరచడానికి ప్రయత్నించాయి; రకరకాల ఎత్తులు, జిత్తులు ప్రయోగించాయి. జ్యోతిబసు వాటన్నింటినీ ఒంటి చేత్తో ప్రతిఘటించారు; విజయం సాధించారు.

జ్యోతిబసు మహా మేధావి; దార్శనికుడు, భవిష్యద్దర్శి; సామాన్య జనం సమస్యలు, వారి ఆలోచనా రీతులు అవగాహన చేసుకోగల్గడం ఆయనకు దేముడిచ్చిన వరాలు; కమ్యూనిజం సిద్ధాంతాన్ని నరనరాన జీర్ణించుకున్న విప్లవవాది - ఇన్ని లక్షణాలు కలగలిసి పోవడం వల్లె ఆయన గత అర్ధ శతాబ్దిలో యావత్ భారతదేశం గర్వించదగిన జాతీయ నాయకుడిగా గుర్తింపు పొందగలిగాడు.

కమ్యూనిస్టు పార్టీలో సైతం ఆయనదొక ప్రత్యేక స్థానం. ఇఎంఎస్. నంబూద్రిపాద్, బిటి. రణదివె వంటి వారు సిద్ధాంత ప్రవక్తలుగా ఎదిగితే; పుచ్చలపల్లి సుందరయ్య, ప్రమోద్‌దాస్ గుప్త వంటి వారు పార్టీ నిర్మాణంలో, ప్రజాఉద్యమాల సారధ్యంలో కీలక పాత్ర వహించారు. జ్యోతిబసు ఈ రెండింటితోపాటు - సామాన్య ప్రజలతో కలిసి పనిచేసి, వారి హృదయాలను గెల్చుకోగలిగారు. సిద్ధాంత నిబద్ధత, రాజకీయ నాయకత్వం, పరిపాలనాదక్షత, ప్రజాభిమానం - ఒకే వ్యక్తిలో నిబిడీకృతం కావడం అత్యంత అరుదైన విషయం. అందుకే జ్యోతిబసు అపూరూపమైన వ్యక్తి.

రాష్ట్ర పరిపాలనలోనూ జ్యోతిబసు చరిత్రాత్మక విజయాలు సాధించారు. భూ సంస్కరణల అమలు, గ్రామీణ స్వయం నిర్ణయాధికారం అందులో ముఖ్యమైనవి. భూమిని పేదలకు పంచిపెట్టడంలో పశ్చిమబెంగాల్ యావత్ దేశానికే ఆదర్శప్రాయంగా నిలిచింది. ప్రభుత్వాధికారం ప్రజల చేతుల్లోనే వుండాలన్న సత్సంకల్పంతో జ్యోతిబసు పంచాయతీ రాజ్ వ్యవస్థను అద్భుతంగా తీర్చిదిద్దాడు. నిర్ణీత సమయంలో పంచాయతీ ఎన్నికలు జరిపించాడు. ప్రతి ప్రభుత్వ కార్యక్రమమూ సర్పంచ్ ఆధ్వర్యంలోనే జరిగేట్లు చూశాడు. దీని ఫలితంగా గ్రామ స్థాయిలో తన పార్టీ పటిష్టపడింది; ప్రజలకూ ప్రభుత్వంలో భాగస్వామ్యం లభించింది. వ్యవసాయ రంగానికి ఆయన ఇచ్చిన ప్రాధాన్యత అంతింతకాదు. గత ఇరవయ్యేళ్లుగా పంటల దిగుబడిలో పశ్చిమబెంగాల్ మొత్తం దేశంలోనే అగ్రస్థానంలో నిలుస్తున్నది. గ్రామీణ స్థాయిలో పేదరిక నిర్మూలన దిశలో జ్యోతిబసు సల్పిన కృషి వృధాపోలేదు.

అయితే పారిశ్రామిక రంగంలో మాత్రం ఆయన వైఫల్యం చెందాడనడం నిజం. 1970 దశకం వరకు కలకత్తా అంటె పారిశ్రామికుల స్వర్గం. పెద్ద పెద్ద పరిశ్రమలన్నీ అక్కడే కేంద్రీకృతమై వుండినాయి. కాని కార్మిక సంఘాలకు, వాటి ఉద్యమాలకు జ్యోతిబసు ప్రభుత్వం అందించిన తోడ్పాటు వికటించి పారిశ్రామిక అశాంతికి దారితీసింది. బిర్లాల వంటి వారు

జమీన్‌రైతు

సైతం కలకత్తా నగరం వదిలి వెళ్లవలసిన ప్రమాదకర పరిస్థితులు నెలకొన్నాయి. ట్రేడ్ యూనియన్ల గొంతెమ్మ కోరికలు తీర్చలేక వందలాది పరిశ్రమలు మూతపడ్డాయి. కొత్తగా పరిశ్రమలు స్థాపించడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఫలితంగా పట్టణ ప్రాంతాలలో నిరుద్యోగం ప్రబలిపోయింది; పేదరికం హెచ్చింది. ఈ పరిస్థితిని జ్యోతిబసు చాలా ఆలస్యంగా గుర్తించాడు. అందువల్లనే గత ఆరేడేళ్లుగా ఆయన పారిశ్రామికులను తిరిగి బెంగాల్‌కు రప్పించడానికి, మూతపడిన పరిశ్రమలను తిరిగి తెరిపించడానికి ఎంతో కష్టపడ్డాడు. అయితే ఆయన ప్రయత్నానికి ఆయనే పెంచి పోషించిన ట్రేడ్ యూనియన్లు సహకరించలేదు. కేంద్రంలో మన్‌మోహన్‌సింగ్ ప్రారంభించిన ఆర్థిక సంస్కరణలు తానూ అనుసరించడానికి జ్యోతిబసు చేసిన ప్రయత్నాలను కార్మిక సంఘాలు ప్రతిఘటించాయి. గ్రాండ్ హోటల్ సంఘటనే దీనికి ఉదాహరణ. ఇన్వెష్టర్లను ఆకర్షించడానికి విదేశీ ప్రయాణాలు చేసినా ఫలితం రాలేదు.

ఈ వైఫల్యాలు ఎన్ని ఉన్నప్పటికీ ఆదర్శప్రాయ ప్రతిపక్ష నేతగా, అద్భుత పరిపాలనా దక్షుడిగా, ఆయన పేరు దేశ చరిత్రలో చిరస్థాయిగా నిల్చిపోతుంది. ప్రజా జీవితంలో తొలి నుంచి తుది వరకు మచ్చలేని వ్యక్తిత్వం, నీతి, నిజాయితీలు, పోరాట పటిమ, పట్టుదలలకు జ్యోతిబసు ఒక ఉపమానం వంటివాడు. పాతికేళ్లు ప్రభుత్వాన్ని నడిపినా ఆయనలో వేలెత్తి చూపే తప్పు చూపడం ఎవరివల్లా కాలేదు. స్ఫటికం వంటి స్వచ్ఛతతో పరిపాలన చేశారాయన. పరిపాలనా బాధ్యతల నుంచి తనంతతాను తప్పుకొన్న జ్యోతిబసు జీవితం భావితరాల వారికి మార్గదర్శకత్వం నెరపుతుంది; ఆదర్శప్రాయంగా నిల్చిపోతుంది.

* * *

## జమీన్‌రైతు

17-11-1950

పేజీలు:12 వెల: 0-3-0

### జై జవహార్ జై హింద్

భారత ప్రధాని, భారత ప్రజ ఆరాధ్య నాయకుడు జవహర్లాల్ నెహ్రూ 61 జన్మదినోత్సవాన్ని దేశమంతా నవంబరు 14తేదీ జరుపుకొన్నది. పెక్కు మంది ప్రజా నాయకులు వారి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని వారి నాయకత్వంలో విశ్వాసాన్ని ప్రకటించారు. వాస్తవిక దృష్టిలో కూడిన వారి దేశ వైదేశ విధానాలు ప్రజల మన్నలను పొందాయి. కల్లోలితమై వున్న నేటి ప్రపంచానికి సుస్థిర శాంతిని చేకూర్చడంలో భారతదేశం తరఫున నెహ్రూ జేసే కృషి సఫలం గావాలని ఆకాంక్షిస్తూ, ఈ సంతోష సమయంలో భారత రథసారథి జవహర్‌కు 'జమీన్‌రైతు' శుభాకాంక్షలందజేస్తున్నది.

### నేపాల్‌లో గృహచ్ఛిద్రం

ప్రపంచంలో నేడున్న ఏకైక హిందూరాజ్యం నేపాళం ఒక్కటే. ఆ ఒక్క హిందూ రాజ్యంలో కూడా గృహచ్ఛిద్రం బ్రద్దలై - సింహాసనాలు తారు మారై పోసాగినవి. నేపాల్ దేశ వైశాల్యం 5,600 చదరపు మైళ్లు. జనాభా 75లక్షలు. హిమవత్పర్వత దక్షిణ సానువుల్లో రమారమి 520 మైళ్లు తూర్పు, పడమరలుగా వ్యాపించి వున్న దేశం ఇది. ప్రాక్తన, ప్రాచ్య హైందవ విజ్ఞాన సామ్రాజ్యంలో నేపాళదేశం ప్రవర్తిల్లిన అమోఘమైన పాత్రను అటుంచి - ఇటీవల చరిత్రను కొంచెం పర్యాలోకన చేసికొన్నట్లయితే, నేపాళంలో నేడు పొటమరించిన

50 ఏళ్ల క్రితం · నాటి

రాజకీయ పోషాలు మనకు అంతగా ఆశ్చర్యాన్ని కలిగించవు.

పృథ్వి నారాయణ్ సింగ్ అను గుర్ఖావీరుడు 18వ శతాబ్ద ఆరంభంలో, ఈ ప్రాంతాన్ని అంతనూ జయించి తన సామ్రాజ్యాన్ని స్థాపించుకొన్నాడు. దానితో నేటి కాశ్మీర్ రాజ్యానికి అంకురార్పణ జరిగింది. నాటి నుండి నేటి వరకు నేపాళ రాజ్యం ఆ వంశం వారి ఏలుబడిలోనే వుంటున్నది. రాజ్యంపై రాజుకు వలెనే ప్రధాన మంత్రి పదవి కూడా 'రాణా'

తరువ 10వ పేజీలో

## జనవాణి

# ట్రాఫిక్‌పై ఎస్పీ శ్రద్ధ అభినందనీయం

కొత్త ఎస్పీ శ్రీనివాసరెడ్డి నెల్లూరులో ట్రాఫిక్ సమస్య పరిష్కారానికి చిత్తశుద్ధితో చేస్తున్న కృషి అభినందనీయం. వారం రోజుల్లో ప్రధాన రహదార్లలో ప్రభుత్వ స్థలాన్ని దురాక్రమించి కట్టుకొన్న కట్టడాలను ఆయన కూల్చి వేయించారు. పట్టణ ట్రాఫిక్‌లో కూడా మార్పు చేర్పులు చేశారు. ప్రతి ట్రాఫిక్ పాయింట్‌లో పోలీసులు కనపడుతున్నారు. కానీ ఇంకా టౌన్‌బస్సుల దూకుడు ఆగలేదు. గతంలో మాదిరి కళ్లాలులేని గుర్రాల వలె అవి రోడ్లపై వెళ్తూనే వున్నాయి. వీటి మీద ఆయన ప్రత్యేక దృష్టిని కేంద్రీకరించాలి, దేవుళ్ల పేరిట, వివిధ పార్టీల పేరిట టౌన్‌లో ఆక్రమణలకు గురైన ప్రభుత్వ స్థలాలను విముక్తి కల్గించిన నాడు ఎస్పీ కలకాలం నెల్లూరీయుల హృదయాల్లో నిలచిపోతాడు.

నెల్లూరు టి.వి.నారాయణ

### కౌన్సిల్ రద్దయితే అవమానం!

నెల్లూరు మునిసిపల్ రాజకీయం గబ్బు గబ్బుగా తయారయ్యింది. 44 మంది కౌన్సిలర్లలో ఏడెనిమిది గ్రూపులున్నాయి. ఒక రంటే మరొకరికి పడదు. ఒకరిని మరొకరు విమర్శించుకుంటూ, ప్రభుత్వానికి ఫిర్యాదులు చేసుకొంటున్నారు. ప్రజలు నెల్లూరుటౌన్ అభివృద్ధిని ఆశించి వీరిని ఈ పదవుల్లో కూర్చోబెట్టారు. కాని వీరంతా ఈ విషయాన్ని మర్చిపోయారు. మునిసిపాలిటీ పీకల్లోతు అప్పుల్లో కూరుకుపోయింది. పనులు చేసిన కాంట్రాక్టర్లకు కోట్ల రూపాయలు బాకీ, ఉద్యోగులకు జీతాలు క్రమపద్ధతిలో ఇచ్చే స్థితి లేదు. గత ఆరు నెలలుగా అభివృద్ధి కార్యక్రమాల ఊసే లేదు. మునిసిపాలిటీలో చిన్న పనైన లైట్లు వేయించడం వంటి కార్యక్రమాల్ని కూడా మునిసిపాలిటీ చేయలేక పోతూంది. ఐదేళ్లు పరిపాలించాల్సిన పాలకులు అర్ధ సంవత్సరంలోనే ప్రజల విశ్వాసాన్ని కోల్పోయారు. రాజకీయ గొడవలు శృతిమించి కౌన్సిల్ రద్దయితే అది నెల్లూరు టౌన్ వాసులందరికీ జరిగిన అవమానంగా భావించ వలసి వస్తుంది.

నెల్లూరు నెల్లూరు బాబు

### ఫోనులేని పుణ్యక్షేత్రం గొలగమూడి

నెల్లూరుటౌన్‌కు సమీపంలో వున్న గొలగమూడి వెంకయ్య స్వామి సన్నిధికి నిత్యం వందలాది మంది భక్తులు వస్తుంటారు. ఈ ఆలయానికి నెలకు లక్షల్లో ఆదాయం వస్తుంది. ప్రస్తుతం కుగ్రామాల్లో సైతం ఫోను సౌకర్యం వున్నా, గొలగమూడి ఆలయ సన్నిధికి చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో ఫోను సౌకర్యం లేదు. ఆలయ అభివృద్ధి కమిటీ ఈ విషయాన్ని పట్టించుకొని, వెంటనే ఎస్టీడి బూతుల ఏర్పాటుకు కృషి చేయాలి.

మద్రాసు ఎన్. రామ్మోహన్‌రెడ్డి

### లేనివాడిని కొట్టి వున్నవాడికి పెట్టడమేమిటి?

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాలు ఎక్కువై పోతున్నాయి. చమురు ఖాతా లోటు పేరు మీద సామాన్యుడి నడ్డి విరిగేలా

తరువ 10వ పేజీలో

# ముంచుకొచ్చిన మెదడువాపు మత్తు వదలని మున్సిపాలిటీ!

దొంగలు పడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగిన సామెతను గుర్తుకు తెస్తున్నారు నెల్లూరు మునిసిపల్ పాలకులు, అధికారులు. పట్టణంలో పారిశుధ్యం పాతరేసినట్లున్నా, నాలుగైదు మెదడు వాపు మరణాలు నమోదైనా మునిసిపల్ అధికారులు ఇంకా కుంభకర్ణ

## ఎక్కడి పందులు అక్కడే

నిద్రను వీడలేదు. పట్టణంలో పారిశుధ్యం మెరుగుపర్చే విషయమై కనీస చర్యలు చేపట్టలేదు. ఈ విషయమై తిరిగ్గా 17తేది సమావేశమవుతున్నారు. మునిసిపల్ శానిటరీ వుద్యోగులకు గత నాలుగైదు నెలలుగా జీతాలు చెల్లించలేదన్న కారణం చూపుతూ విధులకు సరిగ్గా హాజరు కావడం లేదు. తీరా మూడు నెలల జీతాలు చెల్లించాక కూడా మునిసిపల్ అధికారులు వీళ్లతో పనిచేయించ లేక పోతున్నారు. శానిటరీ ఇన్స్‌పెక్టర్స్ జీతాలు తీసుకొనే రోజు మినహా మిగతా రోజుల్లో మునిసిపల్ ఆఫీసుకు రావడమే మానుకున్నారు. 14తేది మునిసిపల్ ఛైర్మన్ ఏర్పాటు చేసిన పట్టణ శానిటేషన్ కమిటీ సమావేశానికి కేవలం ముగ్గురే శానిటరీ ఇన్స్‌పెక్టర్లు వచ్చారు. టౌన్‌లోని వెంగళరావునగర్, సంజయ్‌గాంధీనగర్, హరనాథపురం, అంబాపురం, పొదలకూరురోడ్డు, వేదాయపాళెం, జ్యోతినగర్, మూలపేట, నవాబుపేట, సంతపేట, ఎన్టీఆర్‌నగర్, శెట్టిగుంటరోడ్డు, వెంకటేశ్వరపురం ప్రాంతాల్లో పందుల బెడద జాస్తిగా వుంది. మెదడు వాపు వ్యాధి కారకాలైన ఈ పందులను ఇంత వరకు పట్టణానికి దూరంగా తరలించే ఏర్పాటు మునిసిపాలిటీ చేయలేదు. అవసరమైతే పందులను కాల్చివేసే పర్మిషన్ కోసం

తొరవ 8వ పేజీలో

# మడమ తిప్పని 'ఎస్పీ'

నెల్లూరుటౌన్‌లో ప్రతి బ్రాందీ షాపుకు అనుబంధంగా నడుస్తున్న అనధికార్ల బార్ల నిర్వహణ పట్ల ఎస్పీ శ్రీనివాసరెడ్డి కఠినంగానే వ్యవహరించాలని నిర్ణయించుకొన్నట్టుంది. పోలీస్, ఎక్సైజ్ ఉన్నతాధికార్లు వీటిని చూసి చూడనట్లు పొమ్మన్నా ఆయన తన ధోరణి మార్చుకోలేదు. 12తేది రాత్రి ఎస్పీ టౌన్‌లోని అనధికార్ల బార్లపై మళ్లీ దాడిచేయించారు. రాత్రి 10.30 గం

## అనధికార బార్లపై దాడులు ముమ్మరం

టలు దాటాక కూడా అక్కడ మద్యం తాగుతున్న వ్యక్తులను పోలీసులు అరెస్ట్ చేసి, వైద్య పరీక్షల నిమిత్తం పెద్దాస్పత్రికి తరలించారు. టౌన్‌లోని 20షాపుల మీద ఈ దాడి జరిగింది. పోలీసులు ఈ బార్లపై దాడికి రాకుండా వుండేందుకు నెల్లూరు లిక్కర్ సిండికేట్ నాయకులు రాష్ట్ర ఎక్సైజ్ మంత్రి, ఎక్సైజ్ శాఖ కమిషనర్‌తోపాటు, డైరక్టర్‌ను ప్రత్యేకంగా కలిసి వారిని తమ బుట్టలో వేసుకొన్నారు. గుంటూరు రేంజ్ డిఐజి మాలకొండయ్య ఎస్పీకి ఈ విషయమై సర్ది చెప్పిన మీదట 8తేది నుంచి మళ్లీ ఈ అనధికార బార్లన్నీ తెరిచేశారు. మరీ రెచ్చిపోయిన బ్రాందీ షాపుల యజమానులు తమ బ్రాందీ షాపులు, అనధికార బార్లు రాత్రి 10.30 దాటాక గూడ తెరచి వుంచడంతో చిర్రెత్తిన ఎస్పీ మళ్లీ వీటిపై దాడులు చేయించారు. జిల్లా పోలీసు కార్యాలయం ఎదుట కూల్‌డ్రింక్ షాపును పోలీసులు మినీబార్‌గా వాడుకొంటున్న విషయం తెలుసుకున్న ఎస్పీ, ఆ షాపును అక్కడ నుంచి తొలగింపజేశారు. ఎస్పీలో ఈ కరకు తనం చివరి వరకు వుండాలని ప్రజలు కోరుకొంటున్నారు.

## పిల్లల పార్కు తలుపులు తెరిచారు

నెల్లూరు చింతారెడ్డిపాళెం డొంకలో కాంట్రాక్టర్ జె.ఎస్.రెడ్డి వదాన్యత, మాజీ కలెక్టర్ శ్రీలక్ష్మి కార్యదక్షతకు ప్రతిరూపంగా నిలచిన పిల్లల పార్కు తలుపులు ఎట్టకేలకు 14తేది సాయంత్రం తెరిచారు. ఈ పార్కును జూన్ నెలలో ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి

తొరవ 11వ పేజీలో



నెల్లూరులో దీపం పథకం ద్వారా గ్యాస్ సిలిండర్ల పంపిణీ కార్యక్రమంలో మాట్లాడుతున్న ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి, ప్రక్కన హౌసింగ్ డి.ఎం. రవిప్రకాష్, ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి, తదితరులున్నారు.

# విద్యావనంలో అక్రమాల జంబూకం

ఏళ్లతరబడి నెల్లూరులో పాతుకపోయిన డిప్యూటీ డిఇఓ రామలింగం ఉపాధ్యాయులను రక, రకాలుగా వేధించుక తినడమే కాకుండా, పలు అవినీతి పనులకు పాల్పడుతున్నట్లు తెలిసింది. టీచర్లకు సంబంధించి ప్రభుత్వం ఈ మధ్య నిర్వహించిన రేషనలైజేషన్, కౌన్సిలింగ్, డిఎస్‌సి నియామక వ్యవహారాల్లో డిప్యూటీ డిఇఓ జోక్యం శృతి మించి పోయింది. అన్ని విధాలుగా సంతృప్తి పర్చినవారు, ఆయన వర్గీయులుగా ముద్రపడిన వారికి మాత్రం డిప్యూటీ డిఇఓ నిబంధనలను తీసిగట్టున పెట్టి పోస్టింగులు ఇప్పించారు. రామలింగం నేతృత్వంలో 1998లో జరిగిన టీచర్ల రేషనలైజేషన్ ప్రక్రియ మొత్తం తప్పుల తడకలతో జరిగిందని ప్రభుత్వం తెలుసుకొని, ఈ వ్యవహారమై విచారించమని అప్పటి కలెక్టర్‌ను ఆదేశించింది. అప్పటి జిల్లా మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కోరినట్లు రామలింగం కొన్ని బదలీలు చేసి వుండడం వల్ల కలెక్టర్ నివేదికను బయటకు రాకుండా మంత్రి తొక్కిపట్టారు. రెండేళ్ల పరిధిలో రామలింగం మీద మూడుసార్లు దర్యాప్తులు జరిగినా డిఎస్‌సి వంటి కీలక

## డిప్యూటీ డి.ఇ.ఓ. రామలింగం గారి భాగోతం బట్టబయలు

పోస్టుల నియామక బాధ్యతలు కూడా ఈయనే చూసి పలు రకాలుగా ఈ వ్యవహారం గబ్బు పట్టేందుకు కారకులయ్యారు. డిఎస్‌సిలో సెకండరీ గ్రేడ్ ఉర్దూ పోస్టుకు పరీక్ష వ్రాసిన షేక్ అబ్దుల్ ఖాదర్ రాత పరీక్షల్లో ఉత్తీర్ణుడైనట్లు అధికారులు ప్రకటించారు. 11తేది కాల్ లెటర్‌లో కౌన్సిలింగ్‌కు హాజరైన ఖాదర్ వద్ద ఈ లెటర్‌ను రామలింగం తీసుకొని, మెరిట్ లిస్ట్‌లోని షేక్ సల్మాకు పోస్టింగ్ ఆర్డర్ ఇస్తున్నట్లు చెప్పడంతో ఖాదర్ అక్కడే కళ్లు తిరిగి పడిపోయాడు. డిఎస్‌సి వ్యవహారంలో ఇటువంటి పలు గందరగోళాలకు రామలింగమే బాధ్యడని పరీక్షలు వ్రాసిన పలువురు నిరుద్యోగులు ఆరోపిస్తున్నారు. ఈ వ్యవహారాల్లో ఆయన ముడుపులు అందుకొన్నారన్న ప్రచారం కూడా రేగింది. దీనికి తోడు రామలింగం బహు సరసుడని ఆయన ఇన్‌స్పెక్షన్‌కు వెళ్లిన ఏ స్కూల్‌లోని ఉపాధ్యాయులను అడిగినా అట్టే చెప్పేస్తారు. ఇన్స్‌పెక్షన్ పేరిట మహిళా టీచర్లతో అది కాదురా... ఇది కాదురా.. అంటూ అసభ్యంగా ప్రవర్తిస్తారని వందల కొద్ది

తొరవ 11వ పేజీలో

# నెల్లూరులో పెరిగిన టెలీ ఆగడాలు

నెల్లూరుటౌన్‌లో టెలిఫోన్లలో మహిళలకు వేధింపులు ఎక్కువయ్యాయి. తెగబలిసిన కొందరు జులాయిలు ఈ పనికి పాల్పడుతున్నట్లు తెలిసింది. టెలిఫోన్ మ్రోగిన వెంటనే ఎవరో బంధువులు, లేదా స్నేహితులో ఫోన్ చేశారని ఇళ్లలో వుండే మహిళలు ఫోన్లు ఎత్తుకోగానే 'ఆంటీ ఐ లవ్‌యూ... డార్లింగ్ ఐ లవ్ యూ... అంటూ' అసభ్య సంభాషణలు ప్రారంభిస్తున్నారు. మహిళలు, యువతులు ఈ ఫోన్‌ను వెంటనే డిస్‌కనెక్ట్ చేసినా ఆ రోజే మళ్లీ పది, పదిహేను సార్లు ఇటువంటి ఫోన్లు వస్తున్నాయి. పట్టువదలని విక్రమార్కుల వలె ప్రతి దినం ఈ ఫోన్లను చేస్తుండడంతో ఇళ్లలో వుండే మహిళలు, యువతులు వీటిని ఎత్తాలంటేనే హడలిఛస్తున్నారు. ఈ విషయాలను బయటకు చెప్పుకోలేక ఎక్కువ మంది మహిళలు మనసుల్లోనే మధనపడి పోతున్నారు. ఈ విధంగా ఫోన్లు చేసే ఆకతాయిలను గుర్తించాలంటే టెలిఫోన్ శాఖకు ముందుగా తమ ఫోను కొచ్చే నెంబర్లు పరిశీలనలో పెట్టాలని అభ్యర్థన పెట్టాలి. ప్రత్యేక పరిశీలనలో పెట్టిన ఫోన్లకు, ఎక్కువ శాతం ఫోన్లు ఎస్టీడి బూతుల నుంచి వస్తున్నట్లు తెలిసింది. ఏ నంబరు నుంచి ఫోను వచ్చే విషయం తెలుసుకొనే ప్రత్యేక పరికరాలు నెల్లూరు టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో ఇంకా అందుబాటులోకి రాలేదు. ఇవి వస్తె కాసింతైనా ఈ టెలిఫోన్ వేధింపులు తగ్గేఅవకాశం వుంది. అప్పటి వరకు మహిళలు ఈ విషయమై ధైర్యంగా టెలిఫోన్ శాఖకు ఫిర్యాదు చేయడంతో పాటు, పోలీసులకు ఈ విషయాన్ని తెలియజేయాలి. ఈ వేధింపులకు పాల్పడేవ్యక్తుల నలుగురైదు గురైనా పట్టుపడితే గాని ఈ వ్యవహారానికి ఫుల్ స్టాప్ పడదు. ఎస్పీగారూ! పుణ్యం కట్టుకోండి.

## దొంగలపథకాన్ని విఫలం చేసిన పోలీసులు

నెల్లూరు టౌన్ పోస్టల్ కాలనీలోని ఒక ఇంటి యజమానిని హత్య చేసి ఆ ఇంట్లోని బంగారు, డబ్బు దోచుకెళ్లాలన్న దొంగల పథకాన్ని, పోలీసులు అప్రమత్తం

## నెల్లూరుసంగతులు

కావడంతో విఫలమయ్యింది. పోస్టల్ కాలనీలో ఓ ఇంటిలో డబ్బున్న ముసలి దంపతులు ఒంటరిగా వుంటున్నారన్న విషయాన్ని పేరు మోసిన గజదొంగల ముఠా పసిగట్టింది. వీరిని హతమార్చి, దోపిడి చేయాలని ముఠా రచించుకున్న పథకం కొందరు దొంగల ఇంటరాగేషన్‌లో పోలీసులు తెలుసుకున్నారు. పది రోజుల క్రితం ఎస్పీ ఇచ్చిన ఆదేశాల

తొరవ 11వ పేజీలో

# సభ్యత్వాల్లో రికార్డు సాధిస్తాం

పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమంలో నెల్లూరు జిల్లా రాష్ట్రంలో ప్రథమ స్థానంలో నిలుస్తుందన్న ఆశాభావాన్ని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి వ్యక్తం చేశారు. సభ్యత్వ నమోదు కార్యక్రమంలో భాగంగా 15తేది ఆత్మకూరు వచ్చిన మంత్రి పార్టీ కార్యకర్తల నుద్దేశించి మాట్లాడారు. తెలుగుదేశం పార్టీ చేపట్టిన సంక్షేమ కార్యక్రమాల వల్ల ప్రజలు పార్టీలో చేరను విరివిగా ముందుకు వస్తున్నారు. మహిళలు ఎప్పుడు లేనంత

**ఆదాల**

మంది పార్టీలో చేరు తున్నారు. క్రియాశీలక సభ్యత్వ పుస్తకాలు జిల్లాకు 2,550 ఇస్తే అవిచాలక అదనంగా మరో 650 పుస్తకాలు తెప్పించామన్నారు. సాధారణ సభ్యత్వం కోసం జిల్లాకు 6550 పుస్తకాలు ఇస్తే అవిచాలక మరో 2వేల పుస్తకాలు పంపమని పార్టీ అధిష్టాన వర్గాన్ని కోరినట్లు చెప్పారు. జిల్లా అడ్‌హాక్ కమిటీ కన్వీనర్ ఎల్లసిరి శ్రీనివాసులురెడ్డి మాట్లాడుతూ గతంలో సభ్యత్వాలను నాయకులు ఇళ్ల దగ్గర కూర్చొని పూరి చేసేవారని, ప్రస్తుతం ప్రతి కార్యకర్త ఇంటికి వెళ్లి చేస్తున్నట్లు చెప్పారు. పార్టీ మీద వున్న అభిమానంతో సభ్యత్వ రుసుంను జేబుల్లో నుంచి తీసిస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో పార్టీ పరిశీలకుడు నారాయణ నాయుడు, మాజీ ఎమ్మెల్యేలు కొమ్మిలక్ష్మయ్య నాయుడు, కంచర్ల శ్రీహరినాయుడు, మైనార్టీ నాయకుడు ఖాజావలి, రికో ఛైర్మన్ పందిళ్లపల్లి సుబ్బారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## పంట నష్టం జరిగితే అధికారులపై చర్య

జిల్లాలో ఈసారి ఎక్కడైనా నీరందక రైతుల పంటలు ఎండిపోతే అందుకు నీటిపారుదల శాఖాధికారులను బాధ్యులను చేసి కఠిన చర్యలు తీసుకొంటానని ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి చెప్పారు. ఆత్మకూరులో 15తేది విలేఖరులతో మాట్లాడుతూ సోమశిల ప్రాజెక్టులో సమృద్ధిగా నీరుంది. దాన్ని జాగ్రత్తగా అందించే బాధ్యత నీటిపారుదల శాఖాధికారులది; కావలి, కనుపూరు కాల్వలపై కొందరు రైతులు

తరువాయి 8వ పేజీలో



గూడూరులో సి.ఆర్. రెడ్డి హాస్పిటల్‌ను ప్రారంభిస్తున్న డాక్టర్ సి.ఎం.కె. రెడ్డి. డాక్టర్ సి.ఆర్. రెడ్డి, జనార్ధనరెడ్డి, డాక్టర్ రోహిణి ప్రక్కన వున్నారు.

# ఎస్.ఎస్. కెనాల్ కలేనా?

సోమశిల - స్వర్ణముఖి (ఎస్.ఎస్) లింక్ కెనాల్ నిర్మాణం ప్రతిపాదనలకే పరిమితమయ్యింది. వెంకటగిరి, రాపూరు, వెలుగొండ క్రింద గ్రామాల్లో వేలాది ఎకరాలు మెట్ట ప్రాంత భూములను సస్యశ్యామలం చేసేందుకు ఈ ప్రతిపాదనను సిద్ధం చేశారు. రాపూరు, డక్కిలి, వెంకటగిరి, శ్రీకాళహస్తికి సాగు నీరు అందించే ఎస్.ఎస్.కెనాల్ నిర్మాణానికి

**జిల్లావార్తలు**

243 కోట్ల రూపాయలు ఖర్చు కాగలవని ప్రాథమిక అంచనాలతో గంగ అధికార్లు ప్రభుత్వానికి నివేదిక సమర్పించారు. ఈ కెనాల్ సోమశిల నుండి కండలేరు రిజర్వాయర్‌కు వచ్చే 11వ కిలోమీటర్ వద్ద వున్న ఫ్లడ్‌ఫ్లో ఛానల్ నుంచి ప్రారంభమై రాపూరు, డక్కిలి, వెంకటగిరి ప్రాంతాల కొండ క్రింద దాదాపు 110 కిలోమీటర్లు ప్రయాణించి, చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి వద్ద వున్న స్వర్ణముఖి దాకా నిర్మిత మవుతుంది. ఈ కాలువ క్రింద 53వేల ఎకరాల మెట్ట ఆయకట్టుకు సాగునీరు అందించే ఉద్దేశ్యంతో ప్రణాళిక రూపొందించారు. ఈ కాల్వ మధ్యలో రెండుచోట్ల మినీ రిజర్వాయర్లు నిర్మిస్తున్నందున చుట్టుప్రక్కల ప్రాంతాల్లో భూగర్భ జలాల నీటి మట్టం పెరిగి సాగు, తాగు నీటి ఎద్దడి తీరుతుంది. ఇదేగాక పెన్నా నుంచి వృధాగాపోయే వందల టిఎంసిల నీటిని నిల్వ చేసుకొనే వీలవుతుందని గంగ అధికారులు చెబుతున్నారు. ఈ కాల్వ ద్వారా చిత్తూరు జిల్లాలో వున్న గాలేరు - నగరి సుజల స్రవంతి ప్రాజెక్ట్ క్రింద నిర్ధారించిన కొంత ఆయకట్టుకు సాగునీరు అందుతుందని అధికారులు చెబుతున్నారు. ఈ కాలువ నిర్మాణం చేపడితే ఈ ప్రాంతీయుల తాగు, సాగు నీటి సమస్యలన్నీ తీరుతాయి.

## 10లక్షల డోసుల మెదడువాపు వ్యాక్సిన్

రాష్ట్రంలోని పిల్లలకు మెదడువాపు

తరువాయి 8వ పేజీలో

# బాలికల హాస్టల్‌లో జులాయిల జమానా

సంగంలోని బాలికల హాస్టల్‌లో రక్షణ కరువయ్యింది. గ్రామం నడి బొడ్డులో వున్న హాస్టల్‌కు వార్డన్ లేదు. వాచ్‌మెన్ వున్నా లేనట్టె లెక్క. దీంతో పలువురు రాత్రిళ్లు హాస్టల్‌లోనికి వెళ్లి బాలికలను వేధిస్తున్నారు. చుట్టు ప్రక్కల ప్రాంతాలు కూడా చీకటి పనులకు అనుకూలంగా వున్నాయి. ఈ మధ్య అర్థరాత్రి సమయంలో ఇద్దరు బాలికలను యువకులు లొక్కెళ్లె సమయంలో నిద్ర పోతున్న బాలికల చేతులు తొక్కగా వాళ్లు కేకలు పెట్టారు. ఈ కేకలకు గ్రామం మొత్తం మేల్కొనింది. హాస్టల్ ఇన్‌ఛార్జ్ వార్డన్ ఉదయం 10 గంటలకు వచ్చి సాయంత్రం 4గంటలకు వెళ్లి పోవడమే హాస్టల్‌లో పరిస్థితులు గతితప్పేలా చేస్తున్నాయి. హాస్టల్‌లో వ్యవహారాలు శృతి మించకముందే ఉన్నతాధికార్లు వీటిని సరిదిద్దాల్సి వుంది.

## లంచమిస్తేనే లోను మంజూరు

ఆత్మకూరు మండలంలో వికలాంగులకిచ్చే ప్రత్యేక రుణాన్ని లంచమిస్తేనే గాని విడిఓ మంజూరు చేయడం లేదు. ఇక్కడి మండల పరిషత్ కార్యాలయంలో పనిచేసే విడిఓ నాగేశ్వరరావు వికలాంగులకు ప్రభుత్వమిచ్చే 35వేల రూపాయల రుణం మంజూరుకు 5వేల రూపాయల లంచం డిమాండ్ చేస్తున్నాడు. ఈ రుణానికి ప్రభుత్వం 10వేలరూపాయల సబ్సిడీ ఇస్తుండడంతో వికలాంగులు విడిఓ కోరిన మొత్తం ఇవ్వక తప్పడం లేదు. విడిఓ ఆఫీసుకు

## పత్తాలేని వాచ్‌మెన్ పనికిరాని వార్డన్

రాకుండా ఓ కిల్లీ బంకును తన అడ్డాగా చేసుకొని ఈ లంచాల స్వీకరణ కార్యక్రమం మొదలెట్టాడు. గతంలో రుణాలు తీసుకొన్న వారికి కూడా ఈ రుణాలు మంజూరు చేస్తున్నట్లు విమర్శలు విన వస్తున్నాయి. ఈ విషయంలో తనకేమీ తెలియదని ఎమ్డీఓ 'జమీన్‌రైతు' విలేఖరికి చెప్పారు.

## గూడూరులో అత్యాధునిక ఆసుపత్రి

గూడూరు సిఆర్.రెడ్డి పేరు మీద నిర్మించిన అత్యాధునిక ఆసుపత్రిని 12తేది ప్రొఫెసర్ సిఎంకె.రెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ఆయన మాట్లాడుతూ రోగికి ముందుగా డాక్టర్ మీద నమ్మకం వుండాలని, అటువంటి నమ్మకాన్ని డాక్టర్లు రోగులకు కలుగజేయాలన్నారు. ప్రస్తుతం గూడూరు ఆసుపత్రుల్లో చేస్తున్న చికిత్సకు మూడింతలు డబ్బు మద్రాసులో తీసుకొంటారని చెబుతూ, మంచి హాస్పటల్ నిర్మించిన సిఆర్.రెడ్డిని ప్రశంసించారు. డాక్టర్ సి.ఆర్.రెడ్డి మాట్లాడుతూ తాను ప్రభుత్వ డాక్టర్‌గా పని చేస్తూ మధ్యలోనే రిజైన్ చేసి 1970లో చిన్న ఆసుపత్రిని నిర్మించానని, ప్రజల అభిమానంతో నేడది ఇంత పెద్ద ఆస్పత్రిగా తయారయ్యిందన్నారు. తన తదుపరి ఆసుపత్రిని తన అల్లుడు జనార్ధనరెడ్డి, కుమార్తె రోహిణి బాగా నిర్వహించగలరన్న నమ్మకం కుదిరిందన్నారు. సభకు డాక్టర్ సి.ఎల్.ఎన్.రెడ్డి అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో అల్లారెడ్డి జయలక్ష్మమ్మ జ్యోతి

తరువాయి 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## షోకాజ్ రద్దు

షాదీ మంజిల్ వివాదానికి మున్సిపల్ మంత్రి ఫరూక్ తెరదించేశారు. ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ప్రారంభించిన షాదీమంజిల్ వివాదంలో మంత్రి ఆదాలను ఇరికించాలని, మున్సిపల్ సతీపతులు అనూరాధ, రమేష్‌రెడ్డి పన్నిన పన్నాగం విఫలమైంది. మంత్రి చేత షాదీమంజిల్‌ను దౌర్జన్యంగా ప్రారంభింప చేయించారని వైస్ ఛైర్మన్ సందానిబాషాకు ఇచ్చిన షోకాజ్ నోటీసును రద్దు చేయమని మున్సిపల్ మంత్రి ఆదేశాలు జారీ చేశారు. ఇటువంటి తలతిక్క నోటీసులు జారీచేసి, మున్సిపల్ శాఖ పరువు తియ్యవద్దని అధికార్లను మందలించారట.

## అనూరాధపై విచారణ?

మున్సిపల్ ఛైర్‌పర్సన్ అనూరాధపై కాంగ్రెస్ కౌన్సిలర్లు ఇచ్చిన ఆరోపణలపై ప్రభుత్వం గుంటూరు ఆర్‌జెడిని విచారణ చేయమని ఆదేశించిందని తెలుస్తోంది. మున్సిపల్ పాలన సక్రమంగా జరగకుండా, రౌడీలను, బ్రోకర్లను అడ్డం పెట్టుకొని రమేష్‌రెడ్డి అడ్డు పడుతున్నారని వారు ఆరోపించారు. ఛైర్‌పర్సన్‌ను పక్కన పెట్టి రమేష్‌రెడ్డి ఫైళ్లు చూస్తున్నారని, అధికారులను బెదిరిస్తున్నారని, కాంట్రాక్టర్లకు బిల్లుల చెల్లింపుకు వత్తిడి చేస్తూ, తన వెంట పర్యటనలలో పాల్గొనమని అధికార్లను ఇబ్బంది పెడుతున్నారని ఫిర్యాదు చేశారు. ఛైర్‌పర్సన్ కౌన్సిల్ ఆమోదం లేకుండా లోపాయికారిగా పనులకు నిధులు ఇస్తోందని, చెత్త తొలగింపు పేరుతో లక్షలు స్వాహా చేశారని పేర్కొన్నారు. దాదాపు 12 ఆరోపణలతో కూడిన పిటిషన్‌పై విచారణ జరిపి నివేదిక సమర్పించాలని మున్సిపల్ శాఖ ఆర్‌జెడిని కోరింది. ఎన్నికలు జరిగి అధికారంలోకి వచ్చిన ఆరు నెలలకే ఇంత అగుడు పట్టిన కౌన్సిల్ గతంలో ఎప్పుడూ లేదు. మున్సిపల్ పరిపాలనా వ్యవహారాలలో రమేష్‌రెడ్డి అనవసర జోక్యాన్ని తాము కూడా సీరియస్‌గానే పరిగణిస్తున్నామని మున్సిపల్ మంత్రి కూడా చెప్పాడట.

## పెంచలరెడ్డికి తెలుగుతీర్థం

సర్వేపల్లి మాజీ ఎమ్మెల్యే ఒకప్పటి మాగుంట రాజకీయ సంస్థానంలో మాజీ దివాన్ చెన్నారెడ్డి పెంచలరెడ్డి మళ్లీ తెలుగుదేశం పార్టీలో చేరాడు. బుధవారం నాడు వెంగమాంబపురం సెంటర్‌లో ఆయన చేత, ఆదాల తెలుగు తీర్థం సేవింపచేశారు. కాంగ్రెస్ పార్టీ నుంచి ఇటీవల కాలంలో తెలుగుదేశంలో చేరిన ఆనం సంజీవరెడ్డి, కెవి. సుబ్బారెడ్డిలు, తదితరుల కంటే భిన్నమైన రీతిలో పెంచలరెడ్డి తెలుగుదేశం పార్టీ ప్రవేశం చేశాడు. బహుశా రాష్ట్రంలో ఇంత ఆడంబరంగా, దర్పంగా ఎవరూ తెలుగుదేశం పార్టీలో చేరి ఉండరు. ఆనం సంజీవరెడ్డి, కె.వి.సుబ్బారెడ్డి మాదిరి పెంచలరెడ్డి ఒంటరిగా, అనాథగా పార్టీలో చేరలేదు. ప్రభుత్వం తన భద్రత కోసం నియమించిన గన్‌మెన్‌లు తోడురాగా, కుడి ఎడమల డాల్ కత్తులు మెరవగా అన్నట్టు, దర్పంగా 'ఒకే ఒక్కడై' పార్టీలో చేరాడు. బెస్టాఫ్ లక్!

## రాంనారాయణరెడ్డికి ఆపరేషన్

రాపూరు ఎమ్మెల్యే ఆనం రామ నారాయణరెడ్డికి హైదరాబాద్ గ్లోబల్ ఆస్పత్రిలో గాల్‌బ్లాడర్ ఆపరేషన్ చేశారు. ఆరోగ్యం కుదుటపడి ఆస్పత్రి నుంచి డిశ్చార్జి అయి విశ్రాంతి తీసుకుంటున్నారు. జలుబు చేసి తుమ్ములొస్తేనే మంచం దిగని సుకుమారుడు. పాపం! ఆపరేషన్ అనేసరికి ఎంత భయపడ్డాడో?

## సల్మా వివరణ

నెల్లూరులో 35వార్డులో చెత్త తొలగింపు పేరుతో జరిగిన అవినీతిలో తనకు సంబంధం లేదని ఆ వార్డు కౌన్సిలర్ సల్మా బషీర్ ఒక ప్రకటన పంపింది. చెత్త తొలగిస్తున్న ట్రాక్టర్ సొసైటీకి సంబంధించిందని, గిట్టని వారు తనను అప్రతిష్టపాలుజేసేందుకు కుట్ర పన్ను తున్నారని వాపోయింది. తాను బినామీ పేర్లతో ట్రాక్టర్ నడుపుతున్నట్టు నిరూపించినా, సొసైటీ నుంచి కమీషన్ తీసుకున్నట్టు రుజువులు చూపించినా, రాజకీయాల నుంచి వైదొలగుతానని ప్రకటించింది.

వరల్డ్ డయాబెటిక్ డే సందర్భంగా ఏర్పాటైన కార్యక్రమంలో ప్రసంగిస్తున్న నెల్లూరు లయన్స్ క్లబ్ అధ్యక్షుడు ఐ. ఉదయభాస్కర రావు, ప్రక్కన ఎ.వి.ఆర్. మోహన్ రావు, డాక్టర్లు ప్రతాప్, విజయసారథి, సత్యనారాయణమూర్తి వున్నారు.

## భార్యవేధింపులు తాళలేక భర్త ఆత్మహత్య!

మూలపేట అలంకార్ సెంటర్‌లో కె. గోపాలశెట్టి అనే వ్యక్తి గురువారం వేకువన 3 గంటలకు ఆత్మహత్య చేసుకున్నాడు. గోపాలరెడ్డిని ఆయన భార్య తరచుగా వేధించేదని చెబుతున్నారు. భార్య వేధింపులు తాళలేకనే ఆయన కిరోసిన్ పోసుకొని కాల్చుకొని చనిపోయాడు. శవాన్ని గుట్టు చప్పుడు కాకుండా దహనం చెయ్యాలని ప్రయత్నిస్తుండగా పోలీసులకు సమాచారం అందడంతో శవాన్ని స్వాధీనం చేసుకొని పోస్టు మార్టం కోసం ప్రభుత్వ ఆస్పత్రికి పంపారు. పురుష సంఘాలున్నాయో లేదో? వుంటే వాళ్లెలా ఉద్యమిస్తారో ఈ సంఘనలో?

## చిన్నబజారు రోడ్డుకు ఎమ్పీ నిధులతో మోక్షం

చిన్నబజారులో సిమెంటు రోడ్డు నిర్మాణానికి నెల్లూరు ఎమ్పీ రాజేశ్వరమ్మ తన ఎమ్పీ నిధుల నుంచి 10 లక్షల రూపాయలు మంజూరు చేశారు. ములుమూడి బస్టాండ్ నుంచి ఢైకస్‌రోడ్డు సెంటర్ వరకు కొనసాగే ఈ రోడ్డు నిర్మాణానికి 30లక్షలు ఖర్చవుతుందని అధికారులు అంచనాలు తయారు చేశారు. ఎమ్పీ 10లక్షల ఇవ్వగా మిగతా 20లక్షలలో 14 లక్షలు మునిసిపాలిటీ, మిగతా ఆరు లక్షలు చిన్నబజారు, పెద్దబజారు లోని వ్యాపారులు సమకూరుస్తారు. ఈ పని ఎంత త్వరగా మొదలైతే అంత మంచిది.

## డాక్టర్ అనిల్‌కుమార్‌కు రాష్ట్ర అధ్యక్షత

షుగర్ డాక్టర్ ఐ. అనిల్‌కుమార్ రెడ్డిని ఆంధ్రప్రదేశ్ డయాబెటిక్ ఫెడరేషన్ అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. అనిల్ కుమార్‌రెడ్డి ఈ పదవిలో సంవత్సరం పాటు వుంటారు. చిన్న వయస్సులోనే అనిల్‌కుమార్‌రెడ్డికి పెద్ద పదవి లభించింది. ఫెడరేషన్ అధ్యక్షునిగా షుగర్ వ్యాధి గూర్చి ప్రజల్లో చైతన్యం తెచ్చేందుకు కృషి చేస్తానని చెబుతున్నాడు. డాక్టర్. అనిల్‌కు మా అభినందనలు.

## మదీనా వాచ్ హౌస్

నెల్లూరులో గడియారాల వ్యాపారంలో తిరుగులేని షేక్ ఇస్మాయిల్ ఆర్టీసి బస్టాండ్ దగ్గర సుందర్ లాడ్జి ఎదురుగా కొత్తగా మదీనా వాచ్ హౌస్‌ను పెట్టాడు. 36ఏళ్ల క్రితం మదీనా వాచ్‌కంపెనీ పెట్టిన ఇస్మాయిల్ రకరకాల వాచీల వ్యాపారంలో నెల్లూరీయుల మనసులు దోచుకోబట్టే ఈ వ్యాపారంలో స్థిరపడి పోయాడని చెప్పాలి.

## రోలర్ స్కేటింగ్ పోటీలకు నెల్లూరీయులు

హర్యానాలో నవంబర్ 24తేది నుండి 28తేది వరకు జరిగే జాతీయ స్కూల్ గేమ్స్ రోలర్ స్కేటింగ్ పోటీలకు ఇద్దరు నెల్లూరు విద్యార్థులు ఎన్నికయ్యారు. వై.విశ్వనాథరామకృష్ణ, ఆర్.ఉదయ్ కిరణ్ 17 సంవత్సరాల లోపు బాలుర విభాగపు పోటీల్లో పాల్గొంటారు. ఇద్దరూ పతాకాలతో తిరిగి రావాలని ఆశిస్తున్నాం.

## 16కళ్లు సేకరించిన నేత్ర దాతల సంస్థ

నెల్లూరు నేత్రదాతల సంస్థ ఈ యేడాది జిల్లాలో 16 కళ్లను సేకరించి మద్రాసులోని ఐ బ్యాంకుకు పంపింది. ఈ సంస్థను స్థాపించి నవంబర్ 15

తారువ 7వ పేజీలో

## రైతన్న ఆక్రందన

మొదటి పేజీ తరువాయి

వుంటారా అన్నది ప్రశ్న. కేవలం ప్రభుత్వాల అసమర్థత వల్లే ఈ పరిస్థితి. ఎఫ్‌సిఐ గోడౌన్లలో ధాన్యం నిల్వలు పేరుక పోతున్నాయని ప్రభుత్వాలకు ఆరు నెలల క్రితమే తెలుసు. మొదటిలోనే నిర్ణయం తీసుకొని అదనపు నిల్వలను అంతర్జాతీయ మార్కెట్‌లో ధర తగ్గించి అమ్మేసి వుంటే రైతుకు ఈ పరిస్థితి వచ్చేది కాదు. ఎఫ్‌సిఐ ధాన్యం ఇప్పుడు ఎగుమతికి పనికిరాదు. నాణ్యత చెడి పోయింది. ఆ పుచ్చిపోయిన బియ్యాన్ని పేదలకు ఉచితంగా పంచుతామని. రేషన్ కార్డులపై చవకగా ఇచ్చేస్తామని ప్రకటించింది కేంద్ర ప్రభుత్వం. దానితో మార్కెట్‌లో మరీ గందరగోళ పరిస్థితి. మన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఇప్పుడు నిద్రలేచి శ్రీలంక, బంగ్లాదేశ్‌లకు బియ్యం ఎగుమతి చేయాలని తలపెట్టారు. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకోవడం అంటే ఇదే.

ఇంకొక ప్రక్క తతిమా పైర్ల పరిస్థితి బాగాలేదు. పొగాకు ఏకంగా క్రాప్ హాలిడే ప్రకటించారు. పత్తి, వేరుసెనగ పైర్లకు సోకుతున్న తెగుళ్లను నివారించడం తమ చేతకాదని రాష్ట్ర ప్రభుత్వం చేతులెత్తేసింది. ఏమీ చేయ లేని నిస్సహాయతను దాచుకోవడానికి - ఈ రెండు పైర్లు వేయడం మానుకోమని సలహా ఇచ్చి సరిపెట్టుకున్నారు ప్రభుత్వాధికారులు. ప్రపంచంలో ఏ ప్రభుత్వం కూడా ఇట్లా వ్యవహరించలేదు. చెరకు సంగతి చూస్తే అదొక విషాదగాథ. చక్కెర దిగుమతులపై కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న అపసవ్య విధానాల వల్ల చెరకు ఫ్యాక్టరీలలో లక్షల టన్నుల చక్కెర నిల్వలు పేరుకపోయి రైతులకు డబ్బు చెల్లించలేక తంటాలు పడుతు న్నాయి. ఇట్లా అన్నీ కీలకమైన పైర్ల పరిస్థితి అగమ్య గోచరంగా తయారై వుంది.

ఇదే పరిస్థితి కొనసాగితే రైతుల భవిష్యత్ ఏమిటి? ఏ పైరు పెట్టుకో కుంటే రైతు కుటుంబాలకు జీవనాధారం ఏమిటి? వ్యవసాయం స్తంభించి పోతే కోట్లాది మంది కూలీనాలీ జనం ఏమి తిని, బ్రతకాలి? వారి జీవితాలు ఏమి కావాలి? రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయంలో ఏ మాత్రం శ్రద్ధ పెట్టడం లేదన్నది విచారించదగిన వాస్తవం. చంద్రబాబు దృష్టి ఎప్పుడూ ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ పైనే వుంటుంది. దానికైతే చిల్లిగవ్వ ఖర్చు లేదు; చొక్కా నలిగే శ్రమా లేదు. *

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

తేదీతో 13 సంవత్సరాలు పూర్తయ్యాయి. సంస్థ ఇప్పటి వరకు మొత్తం మీద 101 కళ్లను సేకరించింది. నేత్రదాన యజ్ఞాన్ని నిర్విఘ్నంగా నడిపిస్తున్న సంస్థ కార్యదర్శి తక్కెళ్లపాడు సుకుమార్‌రెడ్డి అభినందనీయుడు.

### వెల్ బేబీ షో

లయన్స్ క్లబ్ ఆఫ్ పినాకిని - లయన్ లేడీస్ ఆగ్జలరీ మరియు జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీ సంయుక్తంగా 12తేది వెల్ బేబి షో పోటీలు నిర్వహించాయి. రంగనాయకులపేట ఆర్య వైశ్య బులియన్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో ఈ పోటీలు జరిగాయి. 6 నెలల నుండి 18 నెలల వయస్సు కల్గిన వారిని ఎ గ్రూప్‌గాను, 19 నెలల నుండి 36 నెలల వయస్సు గల వారిని బి గ్రూప్‌గా నిర్ణయించి పోటీలు పెట్టారు. ఎ గ్రూప్‌లో ఎం.కిరణ్ తేజ, ఎ.కె.అక్షైన్, రుక్సానా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు గెల్చుకొన్నారు. గ్రూప్ బిలో స్మయిలీ, దీక్ష, సాయిప్రణీత్ వరుస మూడు స్థానాలు సాధించారు. డాక్టర్లు జగన్మోహన్‌రావు, పద్మజారాణి, పెంచలయ్య, సత్యనాథ్, ఎవిఎస్.నాయుడు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

### మానసిక వ్యాధిపై అవగాహన సదస్సు

మానసిక, నరాల వ్యాధి నిపుణులు డాక్టర్ డి.సత్యనారాయణ 12తేది పొగతోటలోని తన సాయిసత్య హాస్పిటల్‌లో స్కిజోఫ్రినియా అనే మానసిక వ్యాధిపై ఉచిత అవగాహనా సదస్సు నిర్వహించారు. సదస్సులో ఈ వ్యాధిపై గత దశాబ్దంపైగా విశ్వవ్యాప్తంగా జరిగిన పరిశోధనలు గూర్చి, కొత్తగా వచ్చిన మందుల గూర్చి డాక్టర్ వివరించారు. మానసిక వ్యాధులపై పోస్టర్స్ ప్రదర్శన తోపాటు స్కిజోఫ్రినియా పేషంట్లకు ఉచితంగా 15రోజుల మందులు ఇచ్చారు. అంతర్జాతీయ శైలిలో పేషంట్ల బంధువులకు, తల్లితండ్రులకు వ్యాధి మీద అవగాహన కల్గించడంతో పాటు రోగులకు మానసిక స్థైర్యం కలిగించడానికి విడివిడిగా ప్రత్యేక కౌన్సిలింగ్ నిర్వహించారు.

### వెంకట సత్య సేవా నిధి సాయం

సాహిత్య సదస్సు వ్యవస్థాపకులు గోసుకొండ వెంకట సుబ్బయ్య కుమారుడు శ్రీధర్ తన తల్లితండ్రుల పేర స్థాపించిన 'వెంకట సత్య సేవా నిధి' సాయాన్ని తొలిసారిగా ప్రకటించారు. ఎంసెట్ పరీక్షల్లో చక్కని ప్రతిభ చూపి జవహర్ భారతి ఇంజనీరింగ్ కాలేజిలో చదువుతున్న గట్టుపల్లి సుధాకరయ్య కుమారుడు విజయకుమార్‌కు ఫస్ట్ టర్మ్ ఫీజు చెల్లించారు. 8తేది జరిగిన ఈ కార్యక్రమంలో జె.వి.రెడ్డి, గోసుకొండ వెంకట సుబ్బయ్య తదితరులు పాల్గొన్నారు.

వేదాయపాళెం సెంటర్‌లో మెదడువాపు వ్యాధి నివారణ మందులు పంచి పెడుతున్న బిజెపి పట్టణాధ్యక్షుడు కె. శ్రీనివాసులు, ప్రక్కన బిజెవైఎం పట్టణాధ్యక్షుడు పి. వెంకటరెడ్డి తదితరులున్నారు.

### బిజెవైఎం మందుల పంపిణీ

నెల్లూరు పట్టణ భారతీయ జనతా యువమోర్చా నేతృత్వంలో వేదాయపాళెం సెంటర్‌లో మెదడు వాపు వ్యాధి నిరోధక బెల్లడోనా మాత్రలు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో బిజెపి, దాని అనుబంధ సంఘాల నాయకులు వెంకటరెడ్డి, కప్పిర శ్రీను, జనార్ధనరాజు, జె.సుధీర్ బాబు తదితరులు హాజరయ్యారు.

### తుంగా రాజగోపాలరెడ్డి జయంతి

లాయర్ వారపత్రిక స్థాపకుడు తుంగా రాజగోపాల్‌రెడ్డి 71వ జయంతి సభ, సింహపురి సంగీత సభ నేతృత్వంలో 8తేది కస్తూరిదేవి విద్యాలయ ప్రాంగణంలో జరిగింది. మాగుంట శ్రీనివాసులురెడ్డి, జెకె.రెడ్డి, సినీ నటుడు జె.వి.రమణమూర్తి, లాయర్ ప్రస్తుత సంపాదకుడు శివప్రభాత్ రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా వార్త విలేఖరి ఫణీంద్రకు రాజగోపాల్‌రెడ్డి పేరిట 2వేల రూపాయల ఆర్థిక సహాయం అందించారు. అనంతరం డి.వి.మోహన్‌క్రిష్ణ కచ్చేరి శ్రోతలను అలరించింది. బి.వి.నరసింహం, ఆర్.వి.నాగరాజు ఈ కార్యక్రమ నిర్వాహకులు *

# మిశ్రమ వాస్తుమయం రంగనాథుడి ఆలయం

విక్రమ సింహపురి సీమలో శిల్ప కళా కాణాచి, మహోన్నత నిర్మాణం శ్రీరంగనాయకుల ఆలయం. ఆలయం లోని మిశ్రమ వాస్తు వల్ల ఆలయ ప్రాభవ స్థితి హెచ్చుతగ్గులుగా వుంటుంది.

పెన్నానది పరివాహక ప్రాంతంలో దాదాపు క్రీ.శ.12 శతాబ్దికి పూర్వం ఈ ఆలయ నిర్మాణం జరిగింది.

మైసూరు రాష్ట్రంలోని 'నందిదుర్గం' పర్వతాలలో జనించి అనంతపురం, కడప జిల్లాల గుండా, సోమశిల పంక్తుల ద్వారా నెల్లూరులోకి ప్రవేశిస్తున్న పెన్నకు, పినాకిని, సుప్రయోగ అనే నామాంతరాలున్నాయి. పెన్న పూర్వం ఆలయానికి ఉత్తర, దక్షిణాల్లో ప్రవహించేది. కాలక్రమేణా నేడు 'సంతపేట' వున్న ప్రాంతంలో పెన్న ఎండిపోయి, ఇప్పుడున్న ఉత్తరపాయ మాత్రమే మిగిలింది.

### ఆలయం

ఆలయ ప్రాంతానికి పాలకడలి,

**వాస్తుసంగతులు**
ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి

తల్పగిరి అని నామాంతరాలున్నాయి. ఇక్కడి విష్ణువు 'శయనరాయర పెరుమాళ్ పల్లికొండు పెరుమాళ్. శేషశయన మూర్తిగా పిలువబడుతున్నాడు. స్కంద పురాణంలో ఈ ఆలయ ప్రసక్తి వుంది. కశ్యపమహర్షి తపస్సు చేయడం వల్ల విష్ణువు ఇక్కడ వెలిశాడని స్థలపురాణం.

ఆలయం తూర్పు దిశాభిముఖంగా వుంది. చుట్టూ ప్రదక్షిణ పథం వుంది. ఈశాన్యంలో ఆల్వార్ సన్నిధి, వాయువ్యంలో ఆండాళ్ సన్నిధి, నవదిశస్తంభ మండపం, పశ్చిమంలో ద్వితీయ గోపురం, పెన్నానదీ ప్రవాహం, నైరుతిలో రంగనాయక ఆలయం, అద్దాల మండపం, దక్షిణ మధ్యస్థంలో అలంకార మండపం, ఆగ్నేయంలో వంటశాల (పోటు), ఉత్తర మధ్యస్థంలో వాహన మండపం వున్నాయి.

### ప్రధానాలయం

సన్నిధిలో ముఖ, మహా మండపాలు అంతరాళం, గర్భ గృహం వున్నాయి. విష్ణువు శేషశయనశాయియై శ్రీదేవి, భూదేవీ సమేతుడై నాభిస్థానంలో బ్రహ్మసహితుడై వెలసి వున్నాడు. పెన్న పశ్చిమం గుండా ఉత్తరవాహిని అవుతున్నది కాబట్టి స్వామి పెన్నకు అభిముఖంగా పశ్చిమాభిముఖుడై వున్నారు.

### వైచిత్రి!

పూర్వం తూర్పు ప్రవేశించి, ఉత్తరపథం గుండా పశ్చిమం వచ్చి పెన్నలో స్నానమాచరించి పశ్చిమ ముఖద్వారం గుండా ప్రవేశించేవారు. ఇప్పుడు పశ్చిమ ముఖద్వారాన్ని మూసి దక్షిణ ముఖద్వారాన్ని తెరిచారు. పశ్చిమంలో ధ్వజ స్తంభం వుంది. దీన్ని క్రీ.శ. 1837లో శ్రీమతి యమునా బాయమ్మ నిర్మించారు.

### గోపురం

ఉత్తుంగ గోపురం చోళవాస్తు సమన్వితం. ఏడు అంతరువులతో కుట, పంజర, శాల విభాగాలతో 'వృషభ' గోపురాంతంతో, శిల్పవైభవంతో శోభిల్లుతున్నది. ఈ గోపురం మొత్తం ఎత్తు 96 అడుగులు. అధిష్టానం ఎత్తు (రాతి) 25-30 అడుగులు.

శిఖరాన్ని క్రీ.శ. 1849లో స్వర్గీయ ఎరగుడిపాటి వెంకటాచలం పంతులు దాదాపు 14 సంవత్సరాలు శ్రమించి నిర్మించారు. గోపురం శైలి విజయనగర వాస్తును గుర్తుకు తెస్తుంది.

### చిత్రమేళివిణ్ణగారో!

చిత్రమేళి మండపంలో క్రీ.శ. 1197-98 ప్రాంతంలో చోళమండల ప్రముఖులు సమావేశమై 2,2000 'కుళి'ల భూమిని (దాదాపు 220 ఎకరాలు) ఆలయానికి దానం చేశారు.

### దాన శాసనాలు!

ఆలయంలో శిథిలమైపోగా మిగిలిన శాసనాలు 25 ప్రథమ, తృతీయ కులోత్తుంగ చోళుల శాసనాలు అధికం. ఈ ఆలయానికి వారి సేవ కూడా అధికం.

3వ కులోత్తుంగ క్రీ.శ.1188, 1197-98 శాసనాల్లో అతని సామంతుడు తెలుగు చోళుడు తమ్ము సిద్ధి ముంధైనాడు (కోవూరు)లోని 'తామర మడుగును, స్వామి వారికి దానం చేసినట్లువుంది.

క్రీ.శ. 1209 శాసనంలో పెద్దినాడు (నెల్లూరు)లోని వీరకాడ్ (వీరుకానిపల్లె)ను స్వామికి దానం చేసినట్లు వుంది. ఆ తర్వాత నల్లసిద్ధి, మనుమసిద్ధి మొదలు మొదటి శ్రీరంగరాయల వరకు క్రీ.శ. (1573-74) దాన శాసనాలు ఆలయం లో వున్నాయి.

### మహావాస్తు!

పెన్న పశ్చిమ ప్రవాహమైనా ఉత్తర వాహిని కావడం ఆలయానికి మహర్దశ. తూర్పు గోపుర నిర్మాణం వల్ల ఇంద్ర స్థానం ఉచ్చమై, ఈశాన్యం ద్వితీయ ప్రవేశమై మహర్దశను కలుగజేశాయి. శాస్త్ర బద్ధమైన ఆగ్నేయపు వంటగది, నైరుతి లోని రంగనాయకుల ఆలయం, ప్రదక్షిణ పథంలోని 'చోళ' మండప నిర్మాణం, వాస్తు శ్రేష్ఠతను కలిగించాయి. ఫలితంగా నిరుతి పీడితుడై పశ్చిమ దిశా స్థానం దోషరహితమయ్యింది. ఆగ్నేయం 'సుస్థిర'మయ్యింది. దక్షిణ దిశ అండాళ్ సన్నిధి, నవదశ స్తంభమండపం 'యమస్థానాన్ని' అనుకూల స్థితికి తెచ్చాయి. అందువల్ల ఎన్ని అవాంతరాలున్నా ఆలయ 'స్థితి'కి ఢోకా లేదు.

### అవాస్తు!

ద్వితీయ గోపురావరణ స్థానం, పశ్చిమ ద్వారం మూసివేయడంతో ఆకర్షణకు అడ్డుకట్ట అయ్యింది. తూర్పు, పశ్చిమ ద్వారాలు పూర్వం ఆలయానికి ఉచ్చస్థితిని కలిగించాయి. దిశాస్థానాలు పెరగడం కూడా 'పశ్చిమద్వార' దిగ్బంధనంతో తమ ఉనికి చాటుకొని విజృంభించాయి. స్థల తూకాలలో కూడా తేడా వచ్చింది. నైరుతి, వాయువ్యం కంటే తేలికయ్యింది. ఉత్తర వైకుంఠ ద్వారమున్నా మూసి వేయడం వల్ల ఉత్తమ ఫలితాలు ప్రవేశించ లేకున్నాయి. ఇట్లా ఆలయం హెచ్చు తగ్గులను ఎదుర్కోక తప్పడం లేదు.

### పరిష్కారం!

బహిరాలయ ప్రాంగణంలో ఉత్తర ద్వారాన్ని తెరవడం, ఈశాన్యాన్ని అవసరమైనంత వరకూ 'ఖాళీ' చేయడం (రెండవ గోపురం లోపం) నాలుగు ద్వారాల్ని తెరచి గోపుర నిర్మాణము చేయడం-

అంతరాలయంలో పశ్చిమ ద్వారాన్ని, ఉత్తర ద్వారాన్ని తెరవడం, నైరుతి ఆండాళ్ మండపాన్ని వాయువ్య మండపానికి మించి విస్తృత పరచడం వంటివి చేయడం ద్వారా ఆలయ పూర్వ వైభవాన్ని పునరుద్ధరించ గలుగుతారు.

*శ్రీశ - శ్రీరంగేశ*
*భక్తజనపోష*
*శేషశయనవాస*
*శ్రీకర నెల్లూరివాస!*

## మెదడువాపు

4వ పేజీ కొరవ

ఎస్‌పికి దరఖాస్తు చేయలేదు. బాలాజీ నగర్, హరనాథపురం, రామలింగాపురం, మూలపేట, పొదలకూరు రోడ్డు, వేదాయపాళెం, జ్యోతినగర్, కొండాయపాళెం గేటు ప్రాంతాల్లో దోమల దెబ్బకు జనం హడలి చస్తున్నారు. దోమల నిర్మూలనకు అవసరమైన ఎం.ఎల్. ఆయిల్ కొనేందుకు మునిసిపాలిటీ వద్ద డబ్బులు లేవట. వారం రోజులుగా తూతూ మంత్రమంటూ ఫాగింగ్ మిషన్ మాత్రం తిరుగుతూంది. మురికి కాల్వలను శుభ్రపరచే పనిని మునిసిపాలిటీ ఎప్పుడో మర్చిపోయింది. ఇటువంటి పరిస్థితులలో మెదడు వాపు వ్యాధి, విష జ్వరాలు విజృంభిస్తే ప్రజా సంక్షేమాన్ని చూసే మునిసిపాలిటీ చేతులెత్తడం మినహా చేసేదేమీ లేదు. మునిసిపల్ పాలకులు బిజీ రాజకీయ షెడ్యూళ్లతో, అధికారులు మామూళ్ల వసూళ్లలో నిమగ్నమై పోయి ప్రజారోగ్యాన్ని గాలి కొదిలేస్తే ఎలా?

## రికార్డు

5వ పేజీ కొరవ

ఆయిల్ ఇంజన్లు పెట్టుకొన్నట్లు ఫిర్యాదులు వస్తున్నాయి. ఇంజన్లు పెట్టుకొంది కూడా పంటను కాపాడుకొనేందుకే కాబట్టి మానవతా దృక్పథంతో వారానికి 3 రోజులు పెట్టుకోమని చెప్పాం. మిగతా రోజుల్లో కనపడితే అధికారులు వీటిని పట్టుకపోతారన్నారు. ఆత్మకూరు సప్లై ఛానల్‌కు నీరు సక్రమంగా వచ్చే చర్యలు అధికారులు తీసుకొంటున్నట్లు చెప్పారు. సంగం ఆనకట్టపై ఇసుక బస్తాలు వేసి నీళ్లు నిల్వ ఉండేలా చర్యలు తీసుకొంటామన్నారు. గత ఏడాది సీఆర్‌ఎఫ్ గ్రాంట్ క్రింద జిల్లాకు రావాల్సిన కోటి రూపాయలు తొందరగా వచ్చేలా చర్యలు తీసుకొంటానన్నారు.



బాలల దినోత్సవం సందర్భంగా సాంఘిక సంక్షేమ శాఖ ఏర్పాటు చేసిన బాలల పండుగలో అక్షరదీపాన్ని వెలిగిస్తున్న కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ప్రక్కన ఆయన సతీమణి సునీత, సంక్షేమశాఖ డి.డి. రమణమూర్తి, కౌన్సిలర్ భానుశ్రీ వున్నారు.

## బాలికలహాస్టల్

5వ పేజీ కొరవ

వెలిగించారు. అల్లారెడ్డి శ్యామసుందర్‌రెడ్డి, స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ సీనియర్ మేనేజర్ తిరుపాల్‌రెడ్డి, ఎమ్మెల్యే బల్లిదుర్గాప్రసాద్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

వ్యాధి సోకకుండా ముందు జాగ్రత్తగా హిమాచల్ ప్రదేశ్‌లోని కసౌలి కేంద్ర వైద్య పరిశోధన సంస్థ నుండి వచ్చే యేడాది 10లక్షల డోసుల మెదడు వాపు వ్యాక్సిన్ తెప్పించేందుకు ప్రభుత్వం రంగం సిద్ధం చేసినట్లు రాష్ట్ర ఆరోగ్య శాఖామంత్రి శనక్కాయల అరుణ చెప్పారు. మెదడువాపు వ్యాధి సోకి మరణాలు సంభవించిన అల్లూరు మండలం సింగపేట, బోగోలు మండలం కోవూరుపల్లి గ్రామాల్లో మంత్రి పర్యటించారు. అల్లూరు మండలం సింగపేట గ్రామంలో మెదడు వాపు కారణంగా మరణించిన 12 సంవత్సరాల రాజేశ్వరి తల్లితండ్రులను మంత్రి పరామర్శించారు. ముగ్గురు పిల్లలలో పెద్దదైన రాజేశ్వరి మృతిపట్ల మంత్రి ఆవేదన వ్యక్తం చేశారు. మిగిలిన ఇద్దరు పిల్లలను బాగా చదివించాలని సూచించారు. మెదడు వాపు మందు పంపిణీ గూర్చి గ్రామంలో చదువుకొంటున్న పిల్లలను అడిగి తెలుసుకొన్నారు. ఇక్కడ నివాసంలేని ఎఎన్ఎంను మంత్రి ముందు సస్పెండ్ చేసినా, గ్రామస్తుల అభ్యర్థన మేరకు దాన్ని రద్దు చేసి బుద్ధిగా మసలుకోమని సలహా యిచ్చారు. కోవూరుపల్లి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో స్టాకు రిజిష్టర్‌లోని మందులకు నిల్వలకు తేడా వుండడంతో స్టోర్ రూంను సీజ్ చేసి, జాయింట్ కలెక్టర్ చేత ఈ వ్యవహారమై విచారణ చేయించాలని కలెక్టర్‌ను కోరారు. ఇక్కడి డాక్టర్ విజయకుమార్ చెక్ పవర్‌ను మంత్రి రద్దు చేశారు. అనంతరం మంత్రి కావలి వెళ్లి అక్కడి ప్రభుత్వ ఆసుపత్రిలో స్థితిగతులు పరిశీలించారు.

## ఆంధ్ర ప్రాంత వివిఓల అధ్యక్షుడిగా దేవళ్ల

12తేది తెనాలి రెవిన్యూ మండల కార్యాలయంలో జరిగిన ఆంధ్ర ప్రాంత గ్రామ పరిపాలనాధికారుల సంఘ ఎన్నికల్లో అధ్యక్షునిగా నెల్లూరియుడు దేవళ్ల దశరథరామిరెడ్డి ఎన్నికయ్యారు. రాష్ట్ర అధ్యక్షునిగా ఎన్నిక కావాలంటే ఈ ఎన్నికలో లాంఛనప్రాయంగా నెగ్గాలి.

### హింసధ్వని

-గ్రిద్దలూరు గోపాలరావు

ఏమిటీ వింత!
దుడ్డుకర్రలతో కొట్టినా
శూలాలతో పొడిచినా
బల్లాలతో చీల్చినా
గునపాలు దిగేసినా
సలసలకాగే నూనెలో దోసినా
కుయ్ కయ్ మనడేమిటి!
ఈ పాపిష్టి జీవుడు.

అలసి పోయిన యమకింకరులు
ఆశ్చర్యపోయారందరూ
పోలీస్ లాకప్‌లో
మరణించిన వారికి
యమలోకపు హింస
క్రూరమైనా, దారుణమైనా
లెక్కా లేదు పక్కా లేదు
చీమకుట్టినట్టు కూడా వుండదు
గట్టిగా అన్నాడా జీవుడు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

దుర్మార్గుడుగా మారుతాడు. సత్యభామ తండ్రిని చంపిస్తాడు. ఇలా నరసింహం వక్రబుద్ధి ఇంకా కొన్ని దుర్మార్గాలు చేసిన తర్వాత వాటిని సహించలేని సత్యభామ, పిరికివాడుగా వున్న రవిని ఉద్రేకపరచి నరసింహాన్ని చంపమంటుంది. ఆ ప్రయత్నం వాలించి నరసింహం తలవంచి నీతిమాటలతో అతనిలో మార్పు సాధిస్తుంది.

ఎప్పుడో రవి, సత్యభామను పెళ్లి చేసుకుంటాడన్న భావనతో తన ఆస్తినంతా సత్యభామ తండ్రి రవి పేర వ్రాసి ఆ పత్రాలు నరసింహం వద్ద ఇవ్వటం చాలా అసహజంగా, వాదస్తంగా వుంది. ఇక్కడి నుంచి కథ అడ్డదిడ్డాలుగా అస్తవ్యస్తంగా నడుస్తుంది. అంత ఆస్తి చేజిక్కించుకున్న నరసింహం తన ఒక్కగానొక్క కొడుకు సుఖం కోసం అతని పెళ్లి సత్యభామతో జరిపించ వచ్చుకదా! అతని తీరు చంధాలంగా రూపొందింది. నరసింహం, గాంధీ, నెహ్రూల్లా పేరు గాంచాలని తన జీవిత కథను పుస్తకంగా వ్రాయించటం నగుబాటుగా వుంది. బ్రహ్మానందం, ఎల్బీ శ్రీరాం హాస్యం వెక్కిరింపుగా వుంది.

# 'ముద్దు' వద్దంటే వద్దు పొమ్మన్నారు!

ముద్దు సీన్‌లో నటించను అని చెప్పినందుకే తనను సినిమాలో తీసేశారని ఐశ్వర్యారాయ్ చెప్పింది. విశ్వ సుందరి ఐశ్వర్యారాయ్‌ని అభయ్ చిత్రంలో కమల్‌హాసన్ ప్రక్కన జంటగా నటించేందుకు బుక్ చేశారు. కాని ఈ చిత్రంలో కమల్‌తో ఐశ్వర్యారాయ్ ఒక ముద్దు సీన్‌లో నటించాల్సి వుంది. దీన్ని కాదన్నందుకు తనను హీరోయిన్‌గా తీసేశారని ఐశ్వర్యారాయ్ రుసరుస లాడుతుంది. ఇది జరిగాక కమల్ ప్రక్కన హీరోయిన్ రవీనాటాండన్‌ను బుక్ చేశారు. కమల్‌హాసన్ ప్రక్కన నటించడమే గొప్ప విషయమని, ఇక ముద్దు సన్నివేశమంటే ఎగిరి గంతేశానంటుంది రవీనా.

## మనసులు లేనివారే మనుషులు

ఎవరితోనూ సంబంధం పెట్టుకోక మన పనులు మనం చేసుకొని పోతున్న ప్రక్కన వున్న వాళ్లు ఎందుకు వేధించుక తింటారో తనకు అర్థం కావడం లేదంటుంది లైలా. తెలుగులో నేను కొన్ని చిత్రాల్లో నటించినా అవి విజయం సాధించలేదు. అటుపిమ్మట తమిళ చిత్రరంగంలో కాలు పెడితే అక్కడా

## ఐశ్వర్యారాయ్ ఆవేదన

మొదట కాలం కలసిరాలేదు. అందరూ నన్ను ఐరన్‌లెగ్ అనేసరికి నా హృదయం గాయపడింది. విమర్శలు చేసే వారి నోళ్లకు సీలు వెయ్యాలని పట్టుదలగా నటించేసరికి ఈ యేడాది మూడు చిత్రాలు హిట్ అయ్యాయి. సినీ పరిశ్రమలో మనసులు లేని మనుషులు ఎక్కువంటుంది లైలా.

## భర్తకు దూరంగా మాధురీ దీక్షిత్

మాధురీ దీక్షిత్ బొంబాయిలో తన తల్లిదండ్రుల వద్ద ఉంటోంది. దీనికి కారణం ఆమె భర్త పైచదువులు చదువుతూ క్షణం తీరిక లేకుండా వుండడం. గుండెవ్యాధి నిపుణుడైన మాధురి భర్త శ్రీరామ్ ఎం.ఎస్ చేస్తున్నాడు. ఆయన తన పని మీద మనసులగ్నం కావడం కోసం హాస్పిటల్‌లోనే వుంటున్నాడు. జూలై 2001 వరకు భర్తకు దూరంగా ఉండక తప్పదంటుంది మాధురి.



మా అన్నయ్య చిత్రంలో రాజశేఖర్, మీనా

# యవ్వనంలోనే సొగసుల గల, గల!

నిండైన నవయవ్వనం, అదరగొట్టె అందచందాలు, కలసి వచ్చిన అదృష్టంతో జ్యోతిక తమిళచిత్ర రంగంలో నెంబర్‌వన్ హీరోయిన్ అయ్యింది. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టు కోవాలన్న సామెత మాదిరి వయస్సులో ఉండగానే పొంగులు చూపాలంది. తన విజయానికి చిత్రాల సక్సెస్, కృషి, టాలెంట్, సిన్సియారిటీలే కారణమంటుంది. ఎక్స్‌పోజింగ్ విషయంలో తాను లిబరల్‌గా వుంటానన్న విషయం నిజం కాదంటుంది. కేరక్టర్‌ను బట్టి, డైరక్టర్ సలహాలను బట్టిఅంద చందాలను ప్రదర్శిస్తా. అయితే ఇది ఎక్స్‌పోజింగ్ అంటే నేను ఒప్పుకోను. ఎక్స్‌పోజింగ్ కోసం ఎక్స్‌పోజింగ్ చేస్తె దాన్ని ఎక్స్‌పోజింగ్ అనొచ్చు. నేను క్యారక్టర్ పరంగానే వళ్లు చూపిస్తాను. అయినా నేను ఈ వయసులో గ్లామర్‌గా కనిపించకపోతే - వయస్సు మళ్లిన తర్వాత అక్క వేషాలు, వదిన వేషాలు వేసేటప్పుడు గ్లామర్‌గా కనిపించమంటారా? అప్పుడు ఎవరు చూస్తారు?

## జ్యోతిక

సినిమా ఫీల్డులో వయసుకు తగ్గ వేషాలు వేయాలన్నది నేను నేర్చుకొన్న మొదటి పాఠమంటుంది జ్యోతిక.

## అమెరికా నుంచి ప్రేమ లేఖలు

హీరోయిన్ మీనా తల్లి రాజమల్లికను ఇటీవల మీనా పెళ్లి విషయం ప్రస్తావిస్తే, 'మా అమ్మాయి అమెరికా అబ్బాయిని చేసుకొంటుందని' ప్రకటించింది. పత్రికలు, ప్రసార సాధనాలు ఈ విషయానికి పెద్ద ప్రచారం కల్పించాయి. అప్పటి నుంచి ఇంటర్నెట్‌లోని మీనా వెబ్ సైట్‌కు విపరీతంగా ప్రేమలేఖలు వస్తున్నాయి. ఇంతటితో ఊరుకోక ఇంటికి కూడా విదేశాల నుంచి ప్రతిదినం డజన్ల కొద్దీ ప్రేమలేఖలు వస్తుండేసరికి మీనాకు కోపం నసాలానికి అంటింది. ఈ విషయమై వాళ్ల అమ్మను చెడామడా తిట్టడంతో పాటు, ఇటువంటి ప్రకటనలు ఇవ్వవద్దని హెచ్చరించిందట. తల్లిచాటు బిడ్డైన మీనాకు ఎంత ధైర్యం వచ్చింది?

# ఇమేజ్‌కన్నా ఖజానా మిన్న

నా ఖజానా నిండాలే తప్ప ఇమేజ్‌తో పనిలేదని కౌసల్య నిష్కర్షగా చెప్పింది. మంచినటి అనిపించుకున్న

## కౌసల్య సినీ ఫార్ములా

కౌసల్య ఇటీవల ఇచ్చిన ఈ ప్రకటన అందర్నీ ఆశ్చర్య చకితులను చేసింది. 'ఇమేజా... పాడా, నాకు ఇమేజ్ అవసరం లేదు. డబ్బే కావాలి. నేను అడిగినంత డబ్బిస్తె ఎవరి పక్కనైనా చేస్తానంటుంది. ఈ మధ్య కౌసల్య, హీరో సత్యరాజ్ బంధువైన సత్యన్‌తో ఇళయకన్ అనే చిత్రంలో నటించింది. రెండు రోజులకే ఆ సినిమా డబ్బాలు తిరిగొచ్చేశాయి. అప్పటి నుంచి కౌసల్య ఈ విధంగా మాట్లాడుతుందని ఆమె సన్నిహితులు చెప్పారు.

# 'శ్రీ, శ్రీమతి సత్యభామ' పరమచెత్త

**చిత్రసమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

ఎస్వీ కృష్ణారెడ్డి షరా మామూలుగా "శ్రీ శ్రీమతి సత్యభామ" చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే వ్రాసి, సంగీతం కూర్చి, దర్శకత్వం వహించాడు. కథలో కొత్తదనం లేదు. ఎక్కడా మనసును తాకదు. సన్నివేశాలు కంటికి ఆనవు. స్క్రీన్‌ప్లే అవకతవకలుగా వుంది. కథలోని విషయాలు గతంలో పేరు పొందిన చిత్రాల్లోని కొన్ని అంశాలను తలపింపజేస్తాయి. అందువల్ల చిత్రం చూస్తుంటే విసుగెత్తే పరిస్థితి ఏర్పడుతుంది. దర్శకత్వం ప్రతిభ ఏ కోశానా కనిపించదు. దర్శకుడుగా ఎస్వీ కృష్ణారెడ్డి మళ్లీ దెబ్బ తిన్నాడని చెప్పాలి. సంగీత స్వరాలు అల్లుకొచ్చిన తీరు కూడా ఆకట్టుకోలేదు. వీటన్నిటి వల్ల ఫలితం నిరాశజనకమైంది.

దర్శకుడు తాను దెబ్బ తినటమేగాక కథానాయిక విజయశాంతిని కూడా దెబ్బతీశాడు. గ్లామర్ పాత్రలో శృంగార నైషధంలా కుర్రకారు గుండెల్లో గుబులు రేపే ఔషధంలా ఆకట్టుకుంటూ, హీరోయిజం నిండిన పాత్రల్లో ఉద్రేకం, ఉద్వేగం, ఆవేశం, ఆవేదనలతో విజృంభించి యువకుల్లో చైతన్యం రేకెత్తిస్తూ విజయశాంతి తన ఇమేజ్‌ని ఘనంగా నిలుపుకుంది. శ్రీమతి సత్యభామ పాత్ర పోషణలో ఆ ఇమేజ్ పూర్తిగా పతనమైంది. దీనికి కారణం కథలో చురుకుదనం లోపించటం, సత్యభామ పాత్రలో ఆమె శక్తి సామర్థ్యాలను రుజువు పరచుకోగల చేవ లేక పోవటం, ఆ పాత్రకు సంబంధించిన సన్నివేశాల్లో సహజత్వం కనిపించక పోవటం, అతికించినట్టుగా వుండటం. వెండి తెరపై విజయగర్వపు స్థానంలో నిలిచి వున్న విజయశాంతిని తన చిత్రంలో నటింపజేసే ముందు దర్శకుడు ఆమె ఇమేజ్ దెబ్బ తినకుండా జాగ్రత్త పడి వుండవల్సింది.

సత్యభామ పాత్రే కాదు, రెహమాన్ నటించిన ఆమె ప్రియుడు రవిపాత్ర, ఆమె తల్లి (అన్నపూర్ణ), తండ్రి (రంగనాథ్), ఆమె మేనమామ నరసింహం (అశోక్‌కుమార్) ఈ పాత్రలన్నీ కూడా గుర్తింపు పొందలేక పోయాయి. ఆ పాత్రల్లో నటించిన మంచి నటీ నటులంతా ఔననిపించుకునేందుకు అవకాశం చిక్కక బలైపోయారు.

సత్యానంద్ మాటలు, కథలోని బలహీనతల్ని సరిదిద్దలేక పోయాయి. ఎస్వీ కృష్ణారెడ్డి స్వర పరిచయం పాటల్లోని సాహిత్యపు విలువల్ని చప్పబరిచాయి.

కథను కదిలించి చూస్తె అందులో బలమైన కారణాలు కాని, పరిష్కరించవలసిన సమస్యగాని కనిపించవు. చౌకబారు విషయాలు గోచరిస్తాయి. రవి, సత్యభామ బావా మరదళ్లు, తండ్రి నరసింహం చేతిలో చిన్ననాటి నుంచి దెబ్బలు తిన్న రవి పిరికివాడుగా, అమాయకుడుగా తయారవుతాడు. రవి, సత్యభామను, పెళ్లాడదలుస్తాడు. సత్యభామను రవి తప్పకుండా పెళ్లిచేసుకుంటాడన్న నమ్మకంతో, సత్యభామ తండ్రి తన ఆస్తినంతా రవిపేర వ్రాసి ఆ పత్రాలు నరసింహం వద్ద యిస్తాడు. ఆస్తి చేజిక్కించుకున్న నరసింహం,

తొరవ 8వ పేజీలో

# కలలకోసం సంఘవిగోల

నిద్రలో తనకు కలలు రావడం లేదని సంఘవి తెగబాధపడి పోతోంది. చాలా మంది కలల గూర్చి ఆసక్తిగా మాట్లాడుకొంటూ వుంటారు. నాకు ఆ కబుర్లన్నీ వింటుంటే చాలా ఆశ్చర్యంగా వుంటుంది. వీళ్లకు ఇన్ని మంచి మంచి కలలెలా వస్తున్నాయి? నా కెందుకు ఒక్క కల కూడా రావట్లేదు? అని తెగ ఆలోచిస్తుంటాను. మనిషన్నాక కల రాకపోతే ఎలా అనేది నా బాధ. రోజూ పడుకునే ముందు, ఇవ్వాళ తియ్యటి కలేదైనా వస్తె బావుణ్ను అనుకొంటూ నిద్రపోతాను. కానీ పడుకున్న వెంటనే చాలా గాఢంగా నిద్రపోతాను. ఇక ఏమి గుర్తుండదు. అసలేమి తెలీదు. నిద్ర లేచాక నిన్న రాత్రి నాకు కలేమైనా వచ్చిందాని ఆలోచిస్తె అస్సలేమీ గుర్తుకు రాదు. ఇదే విషయాన్ని అమ్మతో చెప్తె, కలలు రాకపోవడం హాయే కాదా? ఏ బాధ వుండదని చెబుతుందని, వివరించింది సంఘవి.

## నీళ్లంటే భయం

చిన్నతనం నుండీ తనకు నీళ్లంటె చచ్చేంత భయమని హీరోయిన్ రంభ చెప్పింది. మాది విజయవాడ, పర్వదినాల్లో కృష్ణానదిలో మునిగి స్నానాలు చేస్తుంటె నేను మాత్రందూరంగా నిలుచని భయం భయంగా చూస్తుండేదాన్ని. అటువంటిది హీరోయిన్ అయ్యాక రాఘవేంద్రరావు గారి డైరక్షన్‌లో అల్లరి ప్రేమికుడు చిత్రం నటించాను. అందులో స్విమ్మింగ్ పూల్‌లోకి దిగి చేయాల్సిన సీనే వుంది. ఆ మాట చెప్పేసరికి భయపడి చేయనన్నాను. రాఘవేంద్రరావు సరేలే వద్దులే అంటూనే నన్ను మాటల్లో పెట్టి అమాంతంగా తోసేశారు. రాఘవేంద్రరావు అంటె భయంతో ఆ సీన్‌ను ఒకే




అనిపించాను. అప్పటి నుంచి నీళ్లంటె భయం పోయిందని వివరించింది.

## మంచిచిత్రాల్లో నటించాలని...

కంటిన్యూటీ కోసం పది ఫ్లాపు సినిమాలు చేయడం కంటె ఒక్క సక్సెస్ సినిమాలో నటించడం వల్ల కెరీర్ ఫోకస్ అవుతుందని, ఈ థియరీ మా నాన్నగారు చెప్పేవారని హీరో బాలకృష్ణ చెప్పారు.

# వారఫలాలు

*18-11-2000తేది నుండి 24-11-2000తేది వరకు వృషభంలో వక్ర గురు, శనులు; తులలో బుధ; కన్యలో కుజ; ధనుస్సులో శుక్ర, కేతువులు; కర్కాటక, సింహ, కన్య, తులలలో చంద్రుడు.*



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

కుటుంబ వ్యవహారాలు తలనొప్పిగా మారగలవు. కుటుంబ సభ్యులతో విభేదాలు ఏర్పడగలవు. అనుకున్న పనులు కొంత వరకు జరుగుతాయి. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం సామాన్యం. రావలసిన బాకీలు లభించగలవు. ఆర్థిక లావాదేవీలు తాత్కాలికంగా సర్దుబాటు కాగలవు. ఆరోగ్యభారం సరిగా ఉండదు. మనశ్శాంతి తక్కువ. ఉద్యోగులపై అధికారుల పనివత్తిడి ఉంటుంది. వాహన రిపేర్లు జరుగవచ్చును.



## వృషభం

(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

జరుగవలసిన పనులకు ఆటంకాలుంటాయి. పనులను బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకొనండి. ధైర్యంతో ఇబ్బందులను ఎదుర్కొంటారు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. ఖర్చులు కూడా ధారాళంగా పెట్టవలసి వస్తుంది. ఉద్యోగ బాధ్యతల నిర్వహణ బాగుంటుంది. అధికారుల వల్ల ఆలస్యంగా పనులు జరుగుతాయి.



## మిధునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

వృత్తి, వ్యాపార జీవనం గల వారికి ఆశించినంత ఆదాయం లభించదు. వ్యవసాయ, ఉద్యోగ వర్గాలకు ఆశావహంగా వుంటుంది. మొత్తం మీద ఈ రాశి వారికి అవసరాలకు ఆటంకాలు కలుగకుండా సాగిపోతుంది. ఆస్తి వ్యవహారాలు తేలవు.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేష)

ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆర్థిక ప్రగతికై ఆలోచనలు ఏర్పరచుకొంటారు. ఆర్థిక లావాదేవీలు, క్రయవిక్రయాలు లాభసాటిగా ఉంటాయి. సొంత పనులు అనుకూలంగా జరుగుతాయి. ఉద్యోగులకు అధికారుల మద్దతు పూర్తిగా ఉంటుంది. సాంకేతిక, శాస్త్ర రంగాల వారికి విదేశీ అవకాశాలు రాగలవు. క్రయవిక్రయాలు, బాకీలు నిర్ణయ పరిష్కారాలు కాగలవు. వారం మధ్యలో ప్రయాణాలు వస్తాయి.



## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ఆర్థిక పరిస్థితి బాగుండి ఉద్యోగులకు, వ్యాపారులకు ఆదాయం పెరుగుతుంది. బంధుమిత్రులతో మనస్పర్థలు రావచ్చును. కాని తొలగిపోతాయి. కుటుంబ వ్యక్తుల ప్రవర్తన బాధ కలిగించవచ్చును. ఆశించని పనులు, రావలసిన డబ్బు సక్రమంగా ఉండదు. అధికార వర్గంతో ఉద్యోగులు జాగ్రత్తగా మెలగాలి. ప్రభుత్వ సహకారం ఆశించేవారికి ఆలస్యం కాగలదు. విద్యార్థులకు విద్యాభివృద్ధి ఉంటుంది. కొత్తవారి పరిచయాలు, శుభకార్య ప్రయత్నాలు నిర్ణయం కావడం, తల్లిదండ్రులకుగాని, వారి బంధువులకు గాని అనారోగ్యం ఉంటుంది. సాంకేతిక వర్గాలకు, ఉద్యోగులకు లాభం.



## కన్య

(ఉత్తర2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

ఆదాయంతో పాటు దండిగా ఖర్చులుంటాయి. దుబారా తగ్గించుకొంటే మంచిది. కుటుంబంలో చిన్న చిన్న విభేదాలుంటాయి. స్థిరాస్తులు పెట్టుబడుల మీద ఆదాయం ఉంటుంది. అధికార వర్గ తోడ్పాటుతో ఉద్యోగ బాధ్యతలు సక్రమంగా జరిగిపోతాయి. ఉద్యోగపరమైన ప్రయాణాలు కలుగవచ్చును. తల్లి, సోదరి వర్గానికి అనారోగ్య బాధలుండవచ్చును. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్తపడాలి. రాజకీయ రంగాల వారికి మంచి అవకాశాలుంటాయి.

## పంచాంగం

అనూరాధ కార్తె

తేది 19 అనూరాధ కార్తె ప్రారంభం.

ఉత్తమమైన ముహూర్తాలు ఏమీ లేవు.

నవంబరు తిథులు

కార్తీక బహుళ

తేది 18శని సప్తమి ప 1.10గం.వ

తేది 19 ఆది అష్టమి ఉ10.55గం.వ

తేది 20 సోమ నవమి ఉ8.50గం.వ

తేది21మంగళ దశమి ఉ 7.00గం.వ

తరువాత పూర్తిగ ఏకాదశి

తేది 22బుధ ద్వాదశి రా4.15గం.వ

తేది23బేస్త త్రయోదశి రా3.40గం.వ

తేది 24శుక్ర చతుర్దశి రా3.26గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



## తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 )

కుటుంబ వ్యవహారాలు, ఉద్యోగ వ్యవహారాలు కొంత చికాకు కలిగిస్తాయి. మానసికంగా దిగులుంటుంది. ఉదరకోశ రక్తపరమైన రుగ్మతలు కలుగవచ్చును. దూర దేశాల ప్రయత్నాలు చేసేవారికి అవకాశాలు వస్తాయి. వృత్తి, వ్యాపార పెట్టుబడి రంగాల వారికి ఆదాయం పెరుగుతుంది. బంధువులతో సర్దుబాటు జరుగుతుంది. ఉద్యోగులు పై అధికారులను గమనించుకొనాలి.



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి, వ్యాపార రంగాల వారికి ఆదాయం తగ్గుతుంది. వ్యవసాయదారులు, భూమి నుండి రాబడి ఆశించే వారికి ఆర్థికపరమైన చిక్కులుండి ఋణాలు చేయవలసి రావచ్చును. వస్తు విక్రయం జరుగవచ్చును. ఉద్యోగులకు ఇబ్బందులు విధి నిర్వహణలో కలుగుతాయి. రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి బాగుండదు. వస్తు నష్టం, ధన నష్టం కలుగవచ్చును.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

చేస్తున్న పనులు బాగా జరగడం, కొత్త పనులకు అవకాశాలు లభించడం జరుగుతుంది. మానసిక అశాంతి ఎక్కువ. కొంత ఋణం తీరుతుంది. వృత్తి, వ్యాపార ఉద్యోగ రంగాలలో కొత్త మార్పులుంటాయి. ఆదాయం ఖర్చు సమానంగా ఉంటుంది. ఆస్తి క్రయవిక్రయ నిర్ణయాలు జరుగుతాయి. శుభ కార్యాలు నిర్ణయం కాగలవు. ఉద్యోగులకు పదోన్నతి, అధికారవర్గంతో సామరస్యంగా మెలగడం జరుగుతుంది. కొత్త వ్యాపార అవకాశాలున్నాయి. విద్యాప్రగతి బాగుంటుంది. కుటుంబ సభ్యులకు మీకు ఆరోగ్యం తక్కువ.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

మీరు తీసుకొన్న కొన్ని నిర్ణయాలు పొరపాట్లు కాగలవు. జాగ్రత్త వహించాలి. పనులందు ఆటంకాలుంటాయి. స్థిరాస్తులను, వస్తువులను చేకూర్చుకుంటారు. ఆదాయ, వ్యయాలు సమానంగా ఉంటాయి. ముఖ్య బంధువులకు ఆరోగ్యం లోపించవచ్చును. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో అదనపు రాబడి ఉంటుంది.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఆరోగ్య విషయంలో కొంత జాగ్రత్త వహించాలి. అవమానకర సంఘటనలు జరిగే అవకాశాలున్నాయి. సోదర వర్గంతో మీకు విభేదాలు ఏర్పడవచ్చును. కాని సోదర వర్గం మీకు సహకరిస్తుంది. విద్యార్థులకు మరింత విద్యాకృషి అవసరం. బాకీలు నిలబడిపోవటం జరుగుతుంది.



## మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

కొంత ఆస్తిని సంపాదించుకొనడం, ఆస్తి వివాదాలు పరిష్కరించుకొనడం జరుగుతుంది. ఆదాయం ఆశించినంతరాదు. ఖర్చుల భారం తప్పదు. గుండెనిండా అసంతృప్తి చోటు చేసుకొంటుంది. రావలసిన బాకీలు వాయిదాపడతాయి. ఉద్యోగార్థులకు మంచి అవకాశాలు వస్తాయి. సోదర, బంధువర్గం కలసిరాదు.

# జనవాణి

3వ పేజీ కొరవ

వంటగ్యాస్, కిరోసిన్, డీసిల్, పెట్రోల్ ధరలను కేంద్రం పెంచింది. రాష్ట్రానికి వచ్చే నష్టాన్ని పూడ్చుకోవాలంటే బస్సు ఛార్జీలు పెంచాలని రాష్ట్రం పెంచింది. మరో వైపు విద్యుత్ ఛార్జీలు, సబ్సిడీ బియ్యం ధరలు పెంచి సామాన్యుని నోటికందే కూడును లాక్కొంటున్నారు. మొన్ననే విదేశాల్లో పర్యటించి వచ్చిన ముఖ్యమంత్రిగారు పెట్టుబడులతో రాష్ట్రానికి వచ్చే ధనికులకు 25శాతం రాయితీలు ఇస్తామని ప్రకటించారు. రైతులపైనా, పేద బడుగు వర్గాల వారికి ఇస్తున్న సబ్సిడీలలో కోతకోసి, బడా పారిశ్రామికవేత్తలకు రాయితీ లివ్వడం న్యాయమేనా? లేనివాడిని కొట్టి ఉన్నవాడికి పెట్టు అనే సూత్రాన్ని నేటి మన ప్రభుత్వాలకు అవలంభించడం దేశ ప్రజానీకానికి నష్టదాయకం. ప్రజలకు జవాబుదారీగా ఉండలేని ప్రభుత్వాలు ప్రజలను పాలించే అర్హత లేదు.

నెల్లూరు కె.సూర్యనారాయణ

## జంబోజెట్ క్యాబినెట్లు మేలు చేస్తాయా?

రాజ్యాంగంలో మంత్రి వర్గ సభ్యుల సంఖ్య ఎంత వుండాలో స్పష్టంగా పేర్కొనక పోవడాన్ని ఆసరాగా తీసుకొని అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం, మంత్రి వర్గాలను పుష్పక విమానాలు చేస్తున్నారు. చిన్న రాష్ట్రాల్లో ముప్పై మంది సభ్యులు గల అసెంబ్లీలో, 15 మంది మంత్రులున్నా ఆశ్చర్యపోనవసరం లేదు. మంత్రి వర్గంలో స్థానం కల్పించకుంటే ఎక్కడ మద్దతు ఉపసంహరించుకొని ప్రభుత్వాన్ని పడగొడతారోనన్న భయంతో మంత్రుల సంఖ్యను పెంచుకొంటూ పోతున్నారు. ఇటువంటి జంబో క్యాబినెట్లు ఖజానాకు భారం తప్ప జనానికి మేలు చేయవు. పాలనాపరమైన అవసరాలకు అనుగుణంగా ఉండవలసిన మంత్రివర్గాలు కాస్తా రాజకీయ అవసరాలపై ఆధారపడి రూపుదిద్దుకునే స్థాయికి దిగజారిపోయాయి. రాజ్యాంగ స్ఫూర్తికి ఇది విరుద్ధం.

నెల్లూరు వి.సత్యం

## ప్రజలను చైతన్య వంతులను చేయాలి

రాష్ట్రంలో మెదడు వాపు వ్యాధి వల్ల 100 మందికి పైగా పిల్లలు చనిపోయారు. ఈ వ్యాధి లక్షణాలు, సోకిన వెంటనే తీసుకోవాల్సిన తక్షణ జాగ్రత్తలు, ప్రాథమిక చికిత్స గూర్చి ప్రజలకు తెలియడం లేదు. వ్యాధి సోకిన వారికి సత్వర చికిత్స అందడంలో జాప్యం జరుగుతూంది. దీనివల్ల పిల్లలు మృత్యువాత పడుతున్నారు. ఇప్పటికైనా ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు రంగంలోకి దిగి మెదడు వాపు వ్యాధి రాకుండా తీసుకోవాల్సిన కనీస జాగ్రత్త చర్యల గూర్చి వ్యాధి లక్షణాల గూర్చి ప్రజలకు తెలియజేయాలి. వైద్య సదుపాయం అందే ప్రాంతాల గూర్చి తెలపాలి. గత ఏడాది, ఈ యేడాది కూడా మెదడు వాపు వ్యాధిని రాష్ట్ర ప్రభుత్వం ఎదుర్కోవడంలో విఫలమయ్యింది.

నెల్లూరు కె.సువర్చల

## ధాన్యం నిలువ జేసుకొనే వసతే లేదు

మనది వ్యవసాయ ప్రధాన రాష్ట్రం. అయినా ధాన్యం నిల్వ చేసుకోవడానికి పలు గ్రామాల్లో, మండల కేంద్రాల్లో సరైన సౌకర్యాలు లేవు. దీనివల్ల రైతులు పంట చేతికి వచ్చిన వెంటనే అమ్ముకోవాల్సి వస్తూంది. ప్రతి మండలంలో గిడ్డంగులు ఉన్నట్లయితే రైతులు ఆ గిడ్డంగులలో ధాన్యం, ఇతర పంటలను దాచుకోవడానికి అవకాశం వుంటుంది. పంటకు గిట్టు బాటు ధర రానప్పుడు గిట్టుబాటు ధర వచ్చే వరకు ధాన్యాన్ని గోడౌన్లలో దాచుకొనే వీలు కలుగుతుంది. ఈ యేడాది రాష్ట్రంలో 165 కోట్ల టన్నుల వరి పంట చేతికి వచ్చే అవకాశం వుంది. కనీసం 50లక్షల టన్నులు కూడా నిల్వ చేసుకొనే వసతులు రాష్ట్రంలో లేవు. ప్రతి గ్రామ పంచాయతీ నేతృత్వంలో గోడౌన్ల నిర్మాణం జరిపి, అందులో పంట దాచుకోవడానికి కొంత రుసుము వసూలు చేయడం ద్వారా పంట దాచుకొనేందుకు రైతులకు అవకాశం ఇస్తే అది ఎంతో సౌకర్యంగా వుంటుంది.

కోవూరు కొల్లుదురు శంకరయ్య

## పబ్లిక్ స్థలాల్లో పొగ త్రాగనీయకూడదు

పొగత్రాగకూడదని వ్రాసిన చోటులోనే పలువురు పొగత్రాగుతూ కనిపిస్తుంటారు. ముఖ్యంగా ఆర్టీసి బస్సుల్లో డ్రైవర్‌కు ఎదురుగా పొగత్రాగ కూడదని వ్రాసి వుంటుంది. కాని బస్సు డ్రైవర్లు, కండక్టర్లు పొగత్రాగు తుంటారు. బస్సుల్లో మహిళలు, పిల్లలు పొగతాగే వారి నుంచి పడే ఇబ్బందులు అన్నీ, ఇన్నీ కావు. పవిత్ర పుణ్యక్షేత్రమైన తిరుపతిలో కూడా పొగత్రాగ కూడదనే నిబంధన, ఉత్తుత్తి నిబంధనగానే మిగిలి పోయింది. పబ్లిక్ స్థలాల్లో పొగత్రాగనీయకుండా చేసేందుకు ప్రభుత్వం ప్రత్యేక చట్టాన్ని తేవాలి.

నెల్లూరు సోలా జానకీదేవి

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

వంశీయులకు అనువంశికమైన హక్కు ఏర్పడి వుంది. 1846 సంవత్సరంలో మహారాజా రాణావంశానికి చెందిన మహారాజా జంగ్ బహదూర్ రాణాను ప్రధానమంత్రిగా పరిపాలనకు సంబంధించిన సర్వ హక్కుల్నీ దఖలు పరచడమేగాక, ఆ పదవికి అనువంశికమైన సర్వాలను కూడా ప్రసాదించాడు. ఈ విధంగా నేపాళ రాజ్యంలో రాచరికం ఒక వంశానికి, ప్రధాన మంత్రిత్వం మరొక వంశానికి చెంది అన్నిటికీ వారే మూలపురుషులై పోయారు. దశాబ్దాలు, శతాబ్దాలు గడచిన కొలదీ రాజకీయాలలో ఈ రెండు వంశాలు ప్రబలమైన ప్రత్యర్థి శక్తులుగా పరిణమించాయి.

### అంటుంటారు వింటుంటాము

ఆంధ్ర రాజకీయాలు అభివృద్ధి మార్గం కంటే అధో మార్గాన బడడం విచారణీయం. ఐక్యత అనే ప్రశ్న పిచ్చి మాటల క్రింద తేలిపోయింది. ఆంధ్ర రాష్ట్రమనే ప్రశ్నకూడా ఎలక్షను స్టంటుకు ఉపయోగపడవలసిందే కాని కార్య సాధనకు ఉపకరించదు. ఏనాడైనా, ఆంధ్రలో ఐక్యత, ఏక నాయకత్వం లభ్యపడ్డ తర్వాతనే ఆంధ్రరాష్ట్ర ప్రశ్నకు అవకాశం వస్తుంది గాని, లేకపోతే అది పిచ్చి వాగుడు క్రింద తేలిపోతుంది.

ప్రకాశం పంతుల మురాతత్వం నిర్మాణం కంటె విచ్చిత్తి, మార్గానికే దారి తీసింది. కాని, ఇది యెప్పుడో చెప్పిన మాట. ఆయన తత్వంలో విరగడమేకాని వాగడమనేది లేదు. ఆయన వలననే ఆంధ్ర దేశమీగతి పట్టింది, అనేమాట ప్రథమాన్నించి మాకు వున్నా వైటికి వెళ్లగ్రక్కే తాహత్తు లేకపోయినందుకు క్షమించాలి. ఎప్పుడైనా ప్రకాశం గారు కూర్చుని అన్ని వర్గాలను చేరదీసి సమైక్యపరచి అవకాశం ఆయనకు ఒక్కడికే వున్నదనేది గూడా మా చిరకాలాభిప్రాయం. *

# నెల్లూరు సంగతులు

4వ పేజీ కొరవ

మేరకు టౌన్‌లోని ఇద్దరు సిఐలు, ఆరు మంది ఎస్‌ఐలు పోస్టల్ కాలనీలో మారు వేషాల్లో తమ ఆయుధాలతో సహా మోహరించారు. అవసరమైతే వీరిని ఎన్‌కౌంటర్ చేయమని కూడా ఎస్పీ ఆదేశించినట్లు తెలిసింది. ఎస్‌ఐలు, సిఐలు వేకువ ఝాము నాలుగు గంటల వరకు పోస్టల్ కాలనీలో కాపుకాసినా దొంగలు రాలేదు. పోలీసులు కాపు కాసిన విషయం దొంగలకు ఏ విధంగా తెలిసిందని పోలీసు ఉన్నతాధికారులు తలలు బద్దలు కొట్టుకొంటున్నారు. సందట్లో సడేమియాగా మాగుంట లే అవుట్‌లో దొంగల గ్యాంగ్ సోమవారం రాత్రి టౌన్ బస్సు యజమాని వై.రఘురామిరెడ్డి ఇంట్లో పెద్ద దొంగతనం చేసింది. టౌన్‌లో ఒక దొంగల ముఠా ప్రస్తుతం దిగి వున్నట్లు ఈ దొంగతనం నిరూపించింది. పోలీసులు చలికాలం పేరిట ఇళ్లలో ముసుగు పెట్టి నిద్రపోకుండా కాస్త అప్రమత్తంగా వ్యవహరిస్తే పలు దొంగతనాలను జరగకుండా కాపాడిన వారవుతారు.

## గొలుసు దొంగల అరెస్టు

మారుతున్న కాలానికి అనుగుణంగా దొంగలు రకరకాల టెక్నిక్కుల్లో దొంగ తనాలు చేయడం నేర్చుకొన్నారు. టౌన్‌లోని బాలాజీనగర్‌లో కొందరు యువకులు టిప్‌టాప్‌గా డ్రస్‌చేసుకొని ఇళ్లకు వెళ్లి కాలింగ్ బెల్ నొక్కుతారు. ఇళ్లలోని ఆడవారు ఎవరని వచ్చి చూడను నిలబడగానే ఒక్క ఉదటున మెడల్లోని గొలుసులు లాక్కొని పరుగులు పెడతారు. ఈ విధంగా బాలాజీనగర్‌లో గత ఆరు నెలలుగా పది పదిహేను దొంగతనాలు జరిగాయి. బుధవారం మధ్యాహ్నం ఈ ప్రయత్నంలో భాగంగా దొంగలు లీలావతమ్మ అనే మహిళ ఇంటి వద్దకు వెళ్లి కాలింగ్ బెల్ నొక్కారు. పెద్దావిడ బయటకు రాగానే కత్తితో గాయపర్చి గొలుసు లాక్కెళ్లుతుండగా అరచి కేకలు వేయడంతో, దొంగల సమయం బాగోలేక జనం వెంటపడడంతో వాళ్లు దొరికిపోయారు. వీళ్లను దేహశుద్ధి చేసి పోలీసులకు అప్పగించారు.

## బెల్లడోనా తెస్తున్న తంటా

మెదడువాపు వ్యాధి నిర్మూలనకు తారక మంత్రంగా ప్రభుత్వం పంచుతున్న హోమియో మందు బెల్లడోనా మాత్రలు మింగిన పిల్లలకు రియాక్షన్ వస్తున్నది. ఈ మాత్రలు మింగి తీవ్రమైన జ్వరం, వళ్లు తిప్పడం, వాంతులు కావడం వంటి పరిస్థితుల మధ్య పలువురు పిల్లలు చిన్న పిల్లల ఆసుపత్రులలో చికిత్స పొందుతున్నారు. స్కూళ్లు, రోడ్లలో ఎక్కడపడితే అక్కడ మోతాదుకి మించి ఈ మాత్రలు పిల్లల చేత తినిపించడం వల్ల ఈ దుస్థితి దాపురించినట్లు డాక్టర్లు చెబుతున్నారు. బెల్లడోనా మాత్రలు మెదడువాపు రాకుండా అరికడతాయన్న విషయమై ఖచ్చితమైన రుజువేమీ లేకపోయినా ప్రభుత్వం వ్యాధి నివారణకు మార్గం కనుగొనలేక వీటి మీదే ఆధారపడడం విచారకరం.

## పెద్దాస్పత్రిలో ఆరోగ్య మంత్రి దడబడలు

తన ఒక్కరోజు పర్యటనలో భాగంగా 11తేది నెల్లూరుకు విచ్చేసిన రాష్ట్ర వైద్య ఆరోగ్యశాఖ మంత్రిణి శనక్కాయల అరుణ పెద్దాస్పత్రిలో దడబడలు సృష్టించారు. రోగుల పరామర్శతోపాటు డాక్టర్లను మందలించారు. మరో ఇద్దరు ఉద్యోగులకు సస్పెన్షన్ ఉత్తర్వులిచ్చారు. ఉదయం 8 గంటల నుంచి 10 గంటల వరకు మంత్రి పెద్దాస్పత్రిలోని వివిధ విభాగాలను తనిఖీ చేశారు. 250 పడకలున్న ఆసుపత్రిలో 60 మంది రోగులే ఎందుకున్నారని హాస్పిటల్ ఇన్‌ఛార్జి డాక్టర్ జీవన్‌ను ఆమె ప్రశ్నించారు. మీరు సక్రమంగా వైద్యం చేస్తే రోగులెందుకు రారని నిలదీసేసరికి ఆయన ముఖాన నెత్తురు చుక్క లేకుండా పోయింది. వార్డులో వున్న ఓ రోగికి అందుతున్న వైద్య చికిత్సపై మంత్రి ఆరాతీయగా ఫరవాలేదని నిట్టూర్చారు. ఆసుపత్రి బయటకు వస్తుండగా పది మంది బాల సదన్‌కు చెందిన చిన్న పిల్లలు మందుల చీటీలతో, మరో చేతిలో మాత్రలతో మంత్రి దృష్టిలో పడ్డారు. వెంటనే ఆమె వారి చేతిలోని చీటీలను పరిశీలించారు. వీరిలో ఒక పాప గజ్జి, మరో పాప రక్తహీనత వ్యాధులతో బాధపడుతున్నారు. కాని వీరిని చూసిన డాక్టర్ ఏదో నామ మాత్రంగా మందులు రాసిచ్చారు. మంత్రిణి కూడా డాక్టర్ కావడంతో ఆ చీటీలను చూసి వాటిని రాసిచ్చిన డాక్టర్‌ను పిలిపించారు. పిల్లల వ్యాధులకు తగ్గ మందులు మీరు రాయరా? అని పది మందిలో ప్రశ్నించారు. రక్త హీనత ఉన్నట్లు, కడుపులో పురుగులు వున్నట్లు ఈ పిల్లల మొఖం చూస్తేనే తెలుస్తుంది. కాని మీరెందుకు సరైన చికిత్స చేయలేక పోయారంటే ఆ డాక్టర్ నీళ్లు నమిలారు. 5 మాత్రలు రాస్తే పిల్లలకు రెండు మాత్రలు ఇచ్చారు. గజ్జి తగ్గడానికి ఆసుపత్రిలో బెంజాయిల్ బెనార్డ్ మందు కావాల్సినంత స్టాకు వుంది. అది ఇచ్చే తీరిక మీకు లేదు. కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి ప్రభుత్వం ఆసుపత్రికి మందులు పంపి ఏం లాభమన్నారు. బాలసదన్ పిల్లలను సెక్యూరిటీ లేకుండా ఆసుపత్రికి పంపిన వార్డన్ తోపాటు ఇబ్బడి ముబ్బడిగా ఫిర్యాదులందిన ఇక్కడి స్టాఫ్ నర్సును సస్పెండ్ చేయమని మంత్రిణి ఆదేశించారు. ఆసుపత్రిలో రోగులకు దిండ్లు లేకపోయినా, స్టాక్ రూంలో దిండ్లు పేరుకపోయి వుండడం చూసి మంత్రిణి ఆశ్చర్యం వ్యక్తం చేశారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి ఉదాసీన వైఖరి వల్ల జిల్లాలో వైద్య ఆరోగ్య శాఖ కుంభకర్ణ నిద్రలో వుందని మంత్రిణి వ్యాఖ్యానించారు.

## దువ్వూరు రామిరెడ్డి జయంతి సభలు

దువ్వూరు రామిరెడ్డి విజ్ఞాన సమితి వర్తమాన సమాజం సంయుక్త నేతృత్వంలో 9, 10తేదుల్లో టౌన్‌హాల్‌లో కవికోకిల దువ్వూరు రామిరెడ్డి 105వ జయంత్యుత్సవాలు జరిగాయి. మొదటి రోజు జరిగిన సాహిత్య సభకు విజ్ఞాన సమితి అధ్యక్షుడు పి.వి. రమణారెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. తెలుగు సాహిత్యంలో ప్రప్రథమంగా కర్షకుని నాయకుని గావించి కావ్య మల్లిన కర్షక కవిగా రామిరెడ్డి ఎందరికో మార్గ దర్శకత్వం వహించిన ప్రతిభావంతుడని ప్రశంసించారు. ప్రధానవక్త నెల్లూరు వి.ఆర్. కళాశాల ఆంధ్రశాఖ పూర్వాధ్యక్షులు మోపూరు వేణుగోపాలయ్య రామిరెడ్డి కవితా తత్వాన్ని పరామర్శిస్తూ నవ్య సాహిత్యోద్యమంలో రామిరెడ్డి ప్రముఖ స్థానాన్ని సముపార్జించుకొన్న బహుముఖ ప్రజ్ఞానిధి, ప్రణయ కవిత్వం, భక్తి కవిత్వం, దేశభక్తి కవిత్వం, ఆత్మాశ్రయకవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వంలో అగ్రేసరులని, మనస్సును తాకి హృదయాన్ని ద్రవింప జేసే విధంగా వ్రాసిన ఆ మహనీయుని కావ్యాలు ఆంధ్ర కవి లోకంలో చిరస్థాయిగా నిలచిపోగలవన్నారు.

రెండవ నాటి సభ విజ్ఞాన శాస్త్ర సంబంధమైన సభ. ఈ సభకు నెల్లూరు రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాల ప్రధాన సంచాలకులు జెట్టి శేషారెడ్డి అధ్యక్షత వహించారు. ప్రధాన వక్త డాక్టర్ పుచ్చలపల్లి మిత్ర నేడు పొడసూపుతున్న ఆరోగ్య సమస్యలను గూర్చి ఆలోచనలు రేకెత్తించే అద్భుత ప్రసంగం కావించారు. ఆరోగ్య సమస్య సామాజిక సమస్యని, ప్రభుత్వాలు, సమాజం కలసి కట్టుగా ఆరోగ్య పరిరక్షణకు పూనుకోవాలన్నారు. సమాజం కార్యదర్శి పొన్నాల రామసుబ్బారెడ్డి ప్రార్థనా గీతాలాపనతో సభలు ప్రారంభం కావింపబడగా, విజ్ఞాన సమితి కార్యదర్శి అగస్త్యరెడ్డి వెంకురెడ్డి సభల పూర్వాపరాలను వివరించి, ముఖ్య అతిధులను సభలకు పరిచయం కావించి, చివరన ధన్యవాదాలు సమర్పించారు.

## డయాబెటిక్ సెమినార్

ప్రపంచ డయాబెటిక్ దినోత్సవాన్ని పురస్కరించుకొని డాక్టర్ సత్యనారాయణ మూర్తి డయాబెటిక్ క్లినిక్‌లో నెల్లూరు లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు, డయాబెటిక్ సెమినార్‌ను నిర్వహించింది. డాక్టర్ సత్యనారాయణమూర్తి మధుమేహం ఎలా వస్తుంది, దాని నివారణా మార్గాలు, తీసుకోవాల్సిన జాగ్రత్తల గూర్చి వివరించారు. లయన్స్ క్లబ్ అధ్యక్షులు వి. ఉదయభాస్కరరావు, డాక్టర్లు విజయ సారధి, ప్రకాష్, జయచంద్ర, క్లబ్ కార్యదర్శి ఎ.వి.ఆర్. మోహనరావు, లయన్స్ క్లబ్ మాజీ గవర్నర్ సురేష్, ఎక్స్‌ట్రా కేర్ కంపెనీ తరఫున రఘు దీనిలో పాల్గొన్నారు.

## ఎస్పీ

4వ పేజీ కొరవ

ప్రారంభించిన మరుసటి రోజు నుంచే తలుపులు మూసేశారు. కలెక్టర్ శ్రీలక్ష్మి బదలీ అయిపోవడంతో తిరిగి పార్కు తలుపులు తెరిచే విషయమై కొత్త కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ పెద్ద శ్రద్ధ చూపించలేదు. ఈ విషయమై ప్రజలు, పత్రికల నుంచి విమర్శలు రావడంతో తట్టుకోలేక బాలల దినోత్సవాన్ని పురస్కరించుకొని పార్కును ప్రజల సందర్శనార్థం తెరిచారు. ఈ కార్యక్రమానికి జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్, ఎస్పీ శ్రీనివాసరెడ్డి సతీ సమేతంగా హాజరయ్యారు. మునిసిపల్ ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ కూడా అధికారులతో కలసి పార్కంతా కలియ తిరిగారు. మలి ప్రారంభోత్సవ తొలిరోజు ప్రవేశానికి ఎటువంటి రుసుం వసూలు చేయలేదు. 15తేది నుంచి పిల్లలైనా, పెద్దలైనా ఎవరి వద్ద నుంచైనా 2 రూపాయలు ప్రవేశ రుసుం వసూలు చేస్తారు. సాయంత్రం 4 గంటల నుంచి రాత్రి 10 గంటల వరకు పార్కును ప్రజల కోసం తెరచి వుంచుతారు. ఇక్కడ ఇంకా అసంపూర్తిగా మిగిలివున్న ఒకటీఅరా పనులను ఒక నెలలోగా పూర్తి చేస్తామని కలెక్టర్ చెబుతూ, పార్కును అద్భుతంగా తీర్చిదిద్దిన జెఎస్.రెడ్డి, మాజీ కలెక్టర్ శ్రీలక్ష్మి కృషిని ప్రశంసించారు.



గోసుకొండ వెంకటసుబ్బయ్య స్థాపించిన వెంకట సత్యసేవానిధి తరఫున ఎంసెట్‌లో ర్యాంకు సాధించిన విజయకుమార్‌కు స్కాలర్ షిప్ అందిస్తున్న జె.వి. రెడ్డి, చతుర్వేదుల శ్రీరామమూర్తి, గోసుకొండ వెంకటసుబ్బయ్య, విద్యార్థి తండ్రి సుధాకర్ ప్రక్కన వున్నారు.

## 'సవాల్ దస్ కరోడ్‌కా'

-రసిక్

*తన గద్దెను నిలుపు కోవాలన్న తపనతో*
*ముడుపులు ముట్టజెప్పిన నిజం దరిమిలా దాగక*
*కటకటాలపాలు జేస్తున్నది ఓ పూర్వ ప్రధానిని;*
*ముడుపులు తీసుకున్నా, లొసుగు చట్టాల సాయంతో*
*తప్పించుక బయటపడిన వ్యక్తి అర్రులు జాస్తున్నాడు*
*ఓ కొత్త రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా మారేందుకు*

***

*ఒకే రాష్ట్రంలో ఆ పార్టీలు రెండూ పాము, ముంగిసలు*
*ఇంకొక రాష్ట్రంలో అగ్ని, ఆజ్యధారలు*
*మూల సిద్ధాంతాలకు రెండూ తిలోదకాలు*
*కావలసిన దల్లా ఎన్నికల్లో గెలవడం, ఏలుబడి సాగించడం*
*ఏలికలుగా వుంటూ కోట్లకు పడగెత్తడం*

***

*తన్ను క్రికెట్ సారథిగా*
*ఎన్నుకొన్న దేశాన్ని, దేశ ప్రజల్ని వంచించి*
*వారి కలలు కళ్లలో కారం జల్లి*
*మ్యాచ్ ఫిక్సింగ్ పేరిట మాతృదేశ ద్రోహం జేసిన*
*క్రికెటరు సాధించినదేమిటి?*
*కోట్లకు కోట్లా? ఛీత్కారానికి ఛీత్కారాలా?*

***

*సాంకేతిక కళాశాలలు*
*ఊరికొకటి రెండుగా ఉద్భవించడం*
*సరస్వతి భిక్ష ప్రసాదించేందుకా?*
*లక్ష్మీకటాక్షం జుర్రుకొనేందుకా?*

***

*'మనదేశంలో*
*ఎప్పుడు, ఎక్కడ, ఎవరు, ఏ పనిచేస్తున్నా*
*స్వేద ఫలంతోగాక*
*పార్టుకట్‌లో అమాంతం సంపన్నులయ్యేందుకో*
*అన్న సందియం కలుగక మానదు*
*కాకుంటే,*
*మన జనరల్ నాలెడ్జికి మనం పొందగోరుతామా*
*'కౌన్ బనేగా కరోడ్ పతి'లో ఒక కోటి?*
*'సవాల్ దస్ కరోడ్‌కా'లో పది కోట్లా?*

## జంబూకం

4వ పేజీ కొరవ

ఫిర్యాదులు ప్రభుత్వానికి వెళ్లాయి. దీంతో ప్రభుత్వ ప్రత్యేక కార్యదర్శిగా పనిచేసిన ఛాయారతన్, రామలింగం బాలికల స్కూళ్లకు వెళ్లకూడదని ప్రత్యేక ఉత్తర్వులిచ్చినా ఫలితం కాన రావడం లేదు. ఇటీవల జరిగిన కౌన్సిలింగ్, రేషనలైజేషన్‌లలో ముఖ్యమైన పోస్టులను డిప్యూటీ డిఇఓ బయటకు తెలియజేయకుండా తొక్కిపెట్టి తన అనుచరులైన యల్లాయపాళెం తెలుగుపండిట్‌తో మార్కెట్ రేటు పెట్టి అమ్మించారని ఉపాధ్యాయ లోకం కోడైకూస్తోంది. 98లో తాను చేసిన పొరపాట్లపై ఫిర్యాదులు చేసిన బుచ్చి, కోవూరు, కొడవలూరు మండలాలలోని కొందరు ఉపాధ్యాయులపై రామలింగం కత్తికట్టి వున్నట్లు తెలిసింది. సరస్వతి నిలయమైన విద్యాశాఖలో రామలింగం వంటి అవినీతిపరుడు, మహిళా వేధింపులు, ఫలితాలు తారు మారు చేసే వ్యక్తి వుంటే ఆ శాఖ విలువ తగ్గిపోతుంది. రామలింగం వ్యవహార సరళిపై ప్రత్యేక దర్యాప్తు చేయిస్తే ఇంతకు రెట్టింపు విషయాలు బయటపడతాయి. ఈ దిశగా ఉన్నతాధికారులు తగిన నిర్ణయం తీసుకొంటే మంచిది.

Registered : RN 1156 / 57
No. A.P. / VJA / 52 / 8 / 2000



## కరణం బలరాం

మొదటి పేజీ కొరవ

ఒప్పించమని కోరుతూ స్పీకర్ బాల యోగికి అధికారికంగా అభ్యర్థన సమర్పిం చారు. పార్లమెంట్ సభ్యుడ్ని అరెస్ట్ చేయాలంటే ముందుగా స్పీకర్ అనుమతి తప్పనిసరి కావడంతో వారి అభ్యర్థన చేశారు.

ఈ కేసు దర్యాప్తులో పోలీసులకు అంతుచిక్కని ప్రశ్నలు చాలా వున్నాయి. అందులో మొదటిది - అసలీ కారు ఎవరిది అన్నది. దాన్ని బలరాం వాడు తున్న సంగతి అందరికీ తెలుసు. కాని దానికి వున్న రిజిస్ట్రేషన్ నంబరు నకిలీదని తేలింది. హైదరాబాదు ఆర్‌టిఓ ఆఫీసులో ఆ నంబరు రిజిష్టర్ చేసిన వ్యక్తి చిరునామాలో ఆ పేరు గలవారు లేరని తెలిసింది. అంటే కారుకు నకిలీ నంబరు తగిలించడంతో పాటు; ఆ నకిలీ నంబరు రిజిస్ట్రేషన్ సైతం మోసపూ రితమైన దన్నమాట. బలరాం ఢిల్లీలో లేనప్పుడు సాధారణంగా కారును ఎపి భవన్‌లో పార్క్ చేసి వుంచుతారు. కాని ప్రమాదం జరిగినప్పటి నుంచి, ఆ కారు అదృశ్యమై పోయింది. కారును ఇట్లా దాచి వుంచవలసిన అవసరం ఏమిటి అన్నది పోలీసులను సందేహపరుస్తున్న ప్రశ్న.

కారు డ్రైవర్ విషయంలో కూడా పలు అనుమానాలు తలెత్తుతున్నాయి. ఈ డ్రైవరు సాధారణ వ్యక్తి కాదని; అతడికి అంతర్జాతీయ క్రిమినల్ మాఫియా ముఠాలతో సంబంధాలున్నాయని వార్త లు వినవస్తున్నాయి. అతడు గతంలో ఒక తీవ్రవాద సంస్థతో కలిసి పనిచేశాడని పోలీసులు అనుమానిస్తున్నారు. ఇటు వంటి నేర చరిత్ర కల్గిన వ్యక్తి, ఎమ్పీ కారు డ్రైవరు వేషంలో పార్లమెంట్ ఆవరణంలోకి నేరుగా ప్రవేశించడం; ఎమ్పీతో కలిసి పార్లమెంట్ లోపల స్వేచ్ఛగా సంచరించడం ఎంత ప్రమాద కరమో వూహించుకొని ఢిల్లీ పోలీసులు గుండెలు బాదుకొంటున్నారు. ఈ డ్రైవర్ ఆచూకీ, నేర చరిత్రలపై సమాచారం సేకరించడానికి కేంద్ర ఇంటలిజెన్స్ బ్యూరో, "రా" విభాగాల సహాయం అభ్యర్థించారు పోలీసులు. దేశభద్రత, సమగ్రతకు విదేశీయుల నుంచి ఎదు రయ్యే ప్రమాదాల విషయంలో మాత్రమే విచారణ చేపట్టె రీసెర్చ్ అండ్ అనాలి సిస్ వింగ్ (రా) ఒక చిన్న కారు ప్రమా దం కేసులో జోక్యం చేసుకోవడంలోనే - ఈ విషయాన్ని ఢిల్లీ పోలీసులు ఎంత తీవ్రంగా పరిగణిస్తున్నదీ విశదం చేస్తున్నది.

ఈ ప్రమాదంలో గాయపడిన సోహన్‌పాల్ మరణించాడు. దాదాపు పదిరోజుల నరకయాతన అనుభవించి కన్నుమూశాడు. ప్రమాదంలో కారు క్రింద పడగా; అతడ్ని నేరుగా ఆస్పత్రికి తరలించి వుంటే బ్రతికే అవకాశం వుండేది. కాని ఆనాడు కారులో వుండిన వారు ఆ నిర్భాగ్యుడ్ని ఒక బురద




దువ్వూరు రామిరెడ్డి జయంతి సభలో గ్యాస్ట్రోఎంటరాలజిస్ట్ డాక్టర్ పుచ్చలపల్లి మిత్రాను సన్మానిస్తున్న పి.వి. రమణారెడ్డి. ఫోటోలో పాన్గాల రామసుబ్బారెడ్డి, డాక్టర్ శేషారెడ్డి, కె.వి. రెడ్డి వెంకురెడ్డి వున్నారు.

గుంటలో విసిరేసి వెళ్లడంతో, సకాలంలో వైద్య సహాయం అందకుండా పోయింది. ఒక చిన్న కారు ప్రమాదం సంఘటన పట్ల ఎమ్పీ బలరాం ఇంత వివాదా స్పదంగా వ్యవహరించడం ఆశ్చర్యకరం. రేపు 20తేది ప్రారంభం కానున్న పార్లమెంట్ సమావేశాలలోనూ ఈ సంఘటన ప్రస్తావనకు రానున్నది.

ఈ కారు డ్రైవర్ పేరు షాహ్ని - ఆట. అతడి పేరు కాని, అతడి వివరాలు కాని, రూపు రేఖలు కాని పోలీసులకు చెప్పడానికి లేదని; చెప్తే తీవ్ర పరిణా మాలు ఎదుర్కోవలసి వుంటుందని న్యూఢిల్లీ ఎపి భవన్‌లోని తతిమా కారు డ్రైవర్లను, సెక్యూరిటీ గార్డులను ఎవరో ఒక అపరిచిత వ్యక్తి హెచ్చరించి వెళ్లా డని తెలుస్తున్నది.

నేర స్వభావం, నేర చరిత్ర కల్గిన వ్యక్తులు ఎంత ఉన్నత పదవికి వెళ్లినా తమ తత్వం మార్చుకోరు అనేందుకు బలరాం ప్రవర్తన తీరే నిదర్శనం. అయి తే ప్రజాజీవితంలో నీతి, సత్శీలం వుం డాలని వేదికలెక్కి ఊదరగొట్టే ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు - ఈ సంఘటన నుంచి బలరాంను తప్పించ డానికి ప్రయత్నించడం, పోలీసులకు చిక్కకుండా తన వద్ద వుంచు కోవడం విచారకరం. రాజకీయవాదులు చెప్పే మాటలకు, చేసే చేతలకు ఎంత వ్యత్యా సం వుంటుందో తెలిసిందే గదా? *

## ఎ.ఐ.సి.సి.

2వ పేజీ కొరవ

ఎన్నుకొన్న ఈ సమయంలో ఒక వర్గం కోరిక మన్నించినట్లు కన్పడే ఏ పనీ సోనియాగాంధీ తలపెట్ట లేదన్నది రాజకీయ పరిశీలకుల అంచనా. పిసిసి అధ్యక్షుడ్ని మార్చి కొత్తవారికి అవకాశం ఇస్తే - పదవి పోగొట్టుకున్నవారు, ఆశించి భంగపడినవారు మనసు కష్ట పెట్టుకుంటారు. అందువల్ల ఆమె ఆ చీకాకు తెచ్చుకునే ప్రయత్నం చేయరన్నది అందరి అభిప్రాయం. ఇప్పట్లో సత్యనారాయణరావు పదవికి ఏ ఢోకా లేదు.

## నెల్లూరు దేశం

2వ పేజీ కొరవ

చేతికి వస్తే, మున్సిపల్ రాజకీయాల్లో తలనొప్పి తగ్గుతుందన్న అభిప్రాయం రమేష్‌రెడ్డిలో ఉంది. అందువల్లనే ఆయన ఈ పదవి కోసం రొద్దున పడ్డాడు.

జమీన్‌రైతు
సంవత్సర చందా రూ.100లు



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.